కొత్తపల్లి -తెలుగు పిల్లల ఈ (e) మాసపత్రిక మార్చి 2012

**మూలం: http://kottapalli.in/2012/03/welcome**

**సంపాదకులు:** నారాయణ

**ముఖచిత్రం 'వసంతపుటూయల':** అడవిరాముడు

**అక్షర కూర్పు:** *కొత్తపల్లి*

## వెల: పూర్తిగా ఉచితం!

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాట్లుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!



కొత్తపల్లి ప్రచురణలు

యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- 515 101, అనంతపురం జిల్లా.

ఫోను: **08559 240222, 7702877670** ఇ-మెయిలు: **team@kottapalli.in**




# విషయ సూచిక

## ముందుమాట



## ధారావాహిక



## పిల్లలు రాసిన కథలు



## పెద్దలు రాసిన కథలు



## కార్టూన్ కథలు



## అవీ-ఇవీ



## పాట

# చదువుల కాలం

నేను తొందర్లో పెద్దగా ఐపోతానింక. అప్పుడు నీతో మాట్లాడనే మాట్లాడను.." చెబుతున్నది చిన్ని ఎవరితోనో, ముందు గదిలో కూర్చొని.

అమ్మ లోపల్నించి విన్నది. "అబ్బ! ఈ పాప నోరు ఊరుకోదు గదా!" విసుక్కున్నది- "ఎవరే చిన్నీ, ఎవరది?" అడిగింది పైకి.

"నీ పేరేంటి?" అడుగుతోంది చిన్ని-

"పేరేంటంటే ఏమీ చెప్పట్లేదు!" ఫిర్యాదు చేసింది గట్టిగా, అమ్మతో.

అమ్మ చేతులు తుడుచుకుంటూ బయటికొచ్చి చూసింది. చిన్ని ఒక సూర్యకిరణంతోమాట్లాడుతున్నది, దాని ప్రక్కనే కూర్చొని.

"దీని పేరు సూర్య కిరణం. నాకు తెలుసు" అన్నది అమ్మ. "ఇది వెచ్చగా ఉంటుంది. దీనికి మాటలు రావు."

"వచ్చు! ఇది రోజూ నాతో మాట్లాడుతూనే ఉంటుంది!" అన్నది చిన్ని అంత గట్టిగానూ.

సూర్యకిరణంతనదారిన తను నేలమీద పడి కదలకుండా కూర్చున్నది. అమ్మ ఒక్క క్షణం అక్కడే నిలబడి సీరియస్‌గా చూసింది. మళ్ళీ చేస్తున్న పని గుర్తుకొచ్చి, లోపలికి వెళ్ళిపోయింది.

అంతలో ఆ వెలుతురులోకి పాక్కుంటూ వచ్చి కూర్చున్నది, ఒక చిన్న మఖ్మల్ పురుగు. దాని వీపంతా మెరుస్తోంది- మెత్తగా, ఎఱ్ఱగా.

"ఓయ్! ఓయ్!పురుగూ!" అన్నది చిన్ని. సంతోషంతో దాని ముఖంలో వెలుగు పదింతలైంది.

మెల్లగా, సున్నితంగా రెండు వ్రేళ్లతో ఆ ఆరుద్ర పురుగును ఎత్తి అరచేతిలో వేసుకున్నది.

"ఏమ్మా! ఎక్కడ, మీ ఇల్లు? తప్పిపోయావా? చలి పుడుతోందా, నీక్కూడా? దుప్పటి కప్పనా?" అడిగింది.

"ఉహుఁ..వద్దు. నా బొంత నాకున్నదిగదా, నా వీపు మీద?" అన్నది పురుగు, నవ్వుతూ. "మా ఇల్లు ఇక్కడే, కిటికీ ప్రక్కన పూలచెట్టులో. సూర్యకిరణం దారి చూపిస్తే వచ్చాను, నిన్ను కలిసేందుకే" అన్నదది, ముందుకి రెండడుగులు వేసి.

"అవునా, ఊరికే దగ్గరకూర్చున్నట్లు కూర్చొని, ఈ కిరణం ఎంత పని చేసిందో చూడు!" అన్నది చిన్ని, వాళ్ళమ్మ అన్నట్లు యాసపెట్టి.




పురుగు నవ్వింది. "నేనైతే కదుల్తాను కదా, అందుకని నీ దగ్గరికి వచ్చాను. పాపం పూలచెట్టు నీకోసం ఎదురుచూస్తూ అక్కడే నిలబడి ఉంది. చెట్టు కదా, కదల్లేదు అది"

చిన్ని పురుగును చేతబట్టుకొని గెంతుకుంటూ పూలచెట్టు దగ్గరికి వెళ్ళింది చిన్ని.

పూలచెట్టు చిన్నినీ, పురుగునీ చూసి నవ్వింది- "పిల్చుకు రానే వచ్చావు!" అంది. "ఏం లేదు; ఇప్పటివరకూ నేను ఊరికనే ఉన్నాను కదా, కొన్నాళ్ల తర్వాత పూయటం మొదలెడతాను. ఎన్నెన్ని పూలు ఇస్తానో, నిండుగా!నువ్వు నన్ను మర్చిపోయావా, ఏంటి? ఈమధ్య అసలు నా దగ్గరికే రాలేదు!?" అడిగిందది చిన్నిని.

పురుగుని చెట్టు మొదట్లో వదిలి అన్నది చిన్ని-"మాకందరికీ ఒకటో క్లాసు పరీక్షలు కదమ్మా, బాగా చదూకోవాలి. అయినా అమ్మకి చెబుతానులే, మా ఫ్రెండు పూలచెట్టు పక్కన కూర్చొని పద్యాలూ

అవీ చెప్పుకుందాం' అని! సరేనా?!"

"అదే, నేననేది కూడా. మా దగ్గర కూచొని గట్టిగా చదూకుంటే కొంచెం మాక్కూడా చదువొస్తుంది కదా" అన్నది పురుగు.

"వసంతంలో పూలచెట్లు ఎంత మంచి వాసనొస్తాయో తెలుసా? మా దగ్గర కూచొని హాయిగా గడపొచ్చు ఈ చదువులకాలాన్ని!" అన్నది చెట్టు.

"సూర్య కిరణమూ, పురుగూ, పూలచెట్టూ దగ్గర ఉంటే అసలు చలే పుట్టదు- చదువు కూడా చాలా బాగా వస్తుందటమ్మా" కేకలు పెట్టింది చిన్ని, బయటినుంచే.

అమ్మ బదులిచ్చింది లోపల్నించే- "ఎక్కడో ఒకచోట! నువ్వు ఈ నెలంతా చక్కగా చదువుకుంటానంటే నాకు అంతే చాలు!" అని.

అందరికీ చదువులకాలపు అభినందనలు!

కొత్తపల్లి బృందం.

తెనుగుదనమువంటి తీయందనము లేదు
తెనుగు కవులవంటి ఘనులు లేరు
తెనుగు తల్లి సాధుజన కల్పవల్లిరా
లలిత సుగుణజాల! తెలుగుబాల!

రక్తిలేని యాట రాత్రి నిద్దురచేటు
భక్తిలేని పూజ పత్రిచేటు
నీతిలేని చదువు జీతాల చేటురా
లలిత సుగుణజాల! తెలుగుబాల!

తెలుగు బాల పద్యాలను రాసిన కవి కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి గారు




# నీతి చంద్రిక

విగ్రహం-5

*జరిగిన కథ: కుందేళ్ళు-ఏనుగుల కథని కొంగకు చెబుతున్నాయి పక్షులు. ఏనుగుల కాళ్ళక్రింద పడి, చాలా కుందేళ్ళు చనిపోయాయి. విజయుడు అనే కుందేలు చంద్ర మహారాజు ఆజ్ఞను ఏనుగుల రాజుకు వివరిస్తున్నది.. ఇక చదవండి, నీతిచంద్రిక 29 వ భాగం.*

*మూలం: కందుకూరి వీరేశలింగం* *సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ*

"ఆ చంద్రుడంతటివాడు ఆజ్ఞాపించాడంటే అది మనందరికీ శిరోధార్యమే. మారు పలుకక, ఆయన మాట వినండి. అలా ఆచరిస్తామని ముందుగా ఆయనకు విన్నవించుకోండి" అని ముగించింది విజయుడు.

పిడుగు పాటు లాంటి ఆ వాక్యాలు విని అంత పెద్ద ఏనుగుల రాజు గుండెలూ అవిసిపోయాయి. భయంతో ఏనుగుల శరీరాలు వణికాయి. వశం తప్పిన మనసును ఎట్టకేలకు సంబాళించుకొని, వణికే గొంతుతో ఆ ఏనుగుల రాజు అన్నది- "సాధారణ

ప్రాణులం; మేం ఆ మహానుభావుడి కోపం ముందు నిలిచేంతవాళ్లమా?! పిల్లలు బుద్ధిలేక, ఏది మంచో- ఏది చెడో తెలీక, ఒకప్పుడు మాటమీరి ప్రవర్తిస్తే ప్రవర్తించవచ్చు గానీ, తండ్రి దాన్ని మనసులో పెట్టుకుంటాడా? ఆ చంద్రుడికి బుధుడు ఎలా కుమారుడో, మేమూ అంతే! తెలీనితనం కొద్దీ మేం మిమ్మల్ని కష్టపెట్టాం తప్ప, కావాలని కాదు కదా! అందుకని



మా తప్పుల్ని మన్నించమని మా తరపున నువ్వే ఆ చంద్రుడిని వేడుకో, దయచేసి. ఇకపై ఎన్నడూ ఈ సరస్సు దగ్గరికి రాము. ప్రాణ భయం కొద్దీ సమయానుకూలంగా మాట్లాడుతున్న మాట కాదు సుమా, ఇది! మీ రాజుకు మాపైన దయ కలిగేటట్లు ఎలా మాట్లాడతావో, నీదే భారం. మేం మళ్ళీ ఇటు రాము; మాకు మాత్రం నీ మాట సాయం అవసరం. మరువకు. పోయి వస్తాం!" అన్నది.

అప్పుడు కుందేలు దానితో "ఓ రాజా! మా ప్రభువైన చంద్రుడు సన్మార్గాన్ని ప్రేమిస్తాడు. దయానిధి కూడాను. మంచివారి తప్పుల్ని సులువుగా క్షమిస్తాడు. ఈ సరస్సుకు 'చంద్ర సరస్సు' అని పేరు వచ్చింది ఆయన వల్లనే! మేమందరం ఆయన అనుచరులం. ఆయన ఆజ్ఞ మేరకు ఇక్కడ కావలిగా ఉన్నాం. ఆయన మమ్మల్ని తన పిల్లల్లాగా ప్రేమిస్తాడు. ఈ సమయంలో ఆయన చాలా దూరంలో ఆకాశంలో సంచరిస్తూ ఉంటాడు. మనం ఆయన్ని ఇప్పుడు అందుకోవటం అసాధ్యం. అప్పుడప్పుడు ఆయనే స్వయంగా ఈ సరస్సుకు వచ్చి చూసిపోతుంటాడు. ఇవాళ్ల రాత్రి ఇక్కడికి తప్పక విచ్చేస్తాడు.

"సమ్ముఖంలో రాయబారం ఎందుకు?" ఆయన వచ్చినప్పుడు తమరు ఆయన్ని దర్శించుకొని, మీ మాటను మీరే ఆయనకు విన్నవించుకొని, ఆయన అనుగ్రహం పొందవచ్చు. అంతవరకూ ఇక్కడికి దగ్గర్లోనే ఎక్కడైనా విశ్రాంతి తీసుకొమ్మని నా అభ్యర్థన" అని చెప్పి దాన్ని ఒప్పించింది.

కొంత సేపటికి సాయంత్రమైంది. సంజ చీకట్లు తొంగి చూడటం మొదలు పెట్టగానే శశకాల (కుందేళ్ల) ప్రభువైన శశాంకుడు (చంద్రుడు) ఆకాశంలోకి వచ్చాడు. అప్పుడప్పుడే ఉదయిస్తున్న ఆ చంద్రుడు ఎర్రటి కాంతులీనుతూ ప్రకాశిస్తున్నాడు. అతని ప్రతిబింబం నీళ్ళలో తళుకులీనుతున్నది. గాలికి కదలే నీటి కెరటాల నడుమన ఆ ప్రతిబింబం కూడా ప్రకంపిస్తున్నది.

కుందేలు ఏనుగుల రాజును ఆ సమయంలో అక్కడికి తోడుకొని పోయింది. దానిని అక్కడే ఒక చెట్టు చాటుగా నిలిపి, నీటిలో చంద్రుని ప్రతిబింబాన్ని చూపిస్తూ "చూశారా, ఆ మహారాజు కోపంతో ఎలా ఎర్రబారి ఉన్నాడో!? ఎలా ఊగిపోతున్నాడో చూశారుగా?! మీరు ఆయనతో మాట్లాడేందుకు ఇది తగిన సమయం కాదు. ఆయన కొంచెం శాంతించాక, సమయం చూసుకొని మీ తరపున నేనే ఆయనతో మాట్లాడతానులెండి! మీరన్న మాటలు ఆయనకు సమయానుకూలంగా వెల్లడించి, ఆయన మీపట్ల కరుణతో వ్యవహరించేట్లు చూస్తాను.



మీరు మటుకు ఎక్కువ శబ్దం చేయకుండా, వెంటనే మీ తావుకు వెళ్ళిపోండి. ఇక్కడినుండే ఆయనకు నమస్కరించుకొని

పోండి. మిగతా సంగతులన్నీ నాకు వదిలెయ్యండి- నేను చూసుకుంటాను" అన్నది. ఏనుగుల రాజు సంభ్రమాశ్చర్యాలు ముప్పిరిగొనగా అక్కడినుండే చంద్రుడికి మ్రొక్కి, శబ్దంచెయ్యకుండా వెనక్కి తిరిగి వెళ్ళి పోయింది.

విజయుడు ఆ విధంగా ఏనుగులన్నిటినీ వెనక్కి పంపించి, తన జన్మ ధన్యమైందని సంతోషపడ్డది. వికసించిన ముఖంతో అది పోయి తమ రాజు శిలీముఖుడికి నమస్కరించగానే కుందేళ్లరాజు సంతోషంతో మనసు పట్టలేకపోయింది. అదింకా తను ఏం చేసిందో చెప్పకనే ఆ కుందేళ్లరాజు ఆశ్చర్యాన్ని ఒలికించే కళ్లలో కాంతులు మెరుస్తుండగా దానికేసి చూస్తూ "పోయిన పనిని అవలీలగా పూర్తి చేసుకొని వచ్చావని వెలిగిపోతున్న నీ ముఖమే చెప్తున్నది. కోరినదానినల్లా నెరవేర్చుకొనగలిగే సంకల్పశక్తి నీ సొత్తు కదా! నీ కోరిక వ్యర్థం ఎట్లా అవుతుంది?! నీలాంటి వాడు మా మేలు కోరుతున్నాడు కాబట్టే గదా, మేమంతా మృత్యువు పాల బడకుండా బ్రతికి ఉన్నది! పదివేల జన్మలు ఎత్తినా నీ ఋణాన్ని తీర్చుకోలేం, మేము!" అని దాన్ని అనేక విధాలుగా మెచ్చుకున్నది.

అప్పుడా కుందేలు దానితో "మహాప్రభూ! నాపైన ప్రేమకొద్దీ తమరు అలా అంటున్నారు గానీ, నిజానికి నాలో తమరిని మెప్పించగలిగేంత తెలివి ఎక్కడ ఉన్నది? అనామకులం- మాకు, తమరి ప్రశంశకు ఎంతో దూరం! మాకు ఏ కొంచెం శక్తి కలిగినా, అది నిజంగా తమరి చలవే. తమరు ఆజ్ఞాపించాక, ఇక దానికి భిన్నంగాఎలా జరుగుతుంది? వెళ్ళిన పనిని నెరవేర్చుకొచ్చాను- అదంతా తమరి దయ!" అన్నది.

శిలీముఖుడు, ఇతర కుందేళ్ళు అది చెప్పిన సంగతులన్నీ సంతోషంగా విని, తనివితీరా నవ్వుకున్నాయి. విజయుడిని చాలా మెచ్చుకున్నాయి. శిలీముఖుడు దాన్ని తగిన విధంగా సత్కరించాడు. అటుపైన అవన్నీ చాలా సుఖంగా కాలం గడిపాయి" అన్నాయి పక్షులు.

అలా తన కథనాన్ని కొనసాగిస్తూ, కొంగ ఇలా అన్నది-

"ఆ మాటలు వింటున్నకొద్దీ నాకు లోలోపల హృదయం దహించుకు పోయింది. అయినా నేను ఆ అలజడిని బయటికి కనబడనివ్వక, ఆ పక్షులను నిరసిస్తూ అన్నాను- "సత్పురుషులందరికీ మిత్రుడైన ఆ హంస-వరేణ్యుడు వీరాధివీరుడు; తన పరాక్రమం అనే చిరు దివ్వె తోటి 'శత్రు వీరులందరి గర్వం' అనే చీకటిని అవలీలగా పారద్రోలే శక్తివంతుడు. బలవంతులను ఎవ్వరినైనా ఆయన తర్వాతనే లెక్కించాలి. పిరికితనం అన్నది ఆయన ఉండే ఊళ్ళోనే ఉండదు. ఆయన కొంచెం ఇలా కాలు కదిపాడంటే చాలు- అన్ని లోకాలూ గడగడలాడతాయి. మీకు సమయం గడవక, ఊరికెనే ఇంకా పుట్టని పిల్లలకు పేర్లు పెడుతూ గడుపుతుంటారేమోగాని, ఆయన గురించి అసలు మీకు ఏం తెలుసు?

మీలాంటి పండితులే ఇట్లా కాని మాటలు మాట్లాడుతున్నారే, ఇక తెలియని అజ్ఞానుల గురించి ఏం చెప్పేట్లు ఉన్నది?! ఆయన పరాక్రమం ఎంతటిదంటే, ఆయన ఒక్క కర్పూర ద్వీపానికే ఏం ఖర్మ, మూడు లోకాలకూ అధిపతి కాదగినవాడు. ఆయనను గురించి ఇంకా ఏమైనా కాని మాటలు అన్నారంటే అపచారమే. మీ తిట్లు మాని ఊరుకోండి" అని.



అది వినగానే ఆ పక్షులన్నీ మండిపడ్డాయి. 'నన్ను చంపెయ్యాల్సిందే' అని నిశ్చయించుకున్నాయి. అయితే ఆ పనేదో 'తమ రాజు అనుమతి పొందాక చేయవచ్చు' అనుకొని, నామీదపడి, నా పెద రెక్కలు విరిచికట్టి, విపరీతంగా కొట్టాయి. దాంతో నా

ప్రాణాలు కడబట్టి, కోరలు పీకిన త్రాచుపాము మాదిరి రొప్పాను.

ఆపైన అవన్నీ నన్ను తిడుతూ, తన్నుతూ, ఎగతాళిచేస్తూ బలవంతంగా వాళ్ళ సభా స్థలానికి లాక్కుపోయాయి. ఆ సభ అంతా దుర్జనులతో నిండి, మహా దారుణంగా ఉంది. అక్కడ అవి నన్ను తమ రాజు ముందు నిలబెట్టి సభలోని వాళ్లంతా వింటుండగా "స్వామీ! మేమందరం తమరి అనుచరులం. తమరు చెప్పిన పనిని చేసేవాళ్లం. 'తెలిసిన సంగతులు చెప్పకుండా కప్పిపెట్టి, తమంతట తామే ఏదో ఒకటి చేయటం సేవకులకు తగదు'- అందుకని ఈ దుర్మార్గుడి కథంతా తమరికి నివేదించి, తమరు చెప్పినట్లుగా నడుద్దామని వచ్చాము. ఈ మొరటు కొంగకు పోగాలం దాపురించింది. 'ఏది మంచిది-ఏది తగనిది' అన్న జ్ఞానం పూర్తిగా నశించింది. అందుకనే ధర్మ స్వరూపులైన తమరిపైన అపనిందలు వేసేందుకు సాహసించాడు. "ఇతరులకు చెడు చేద్దామనుకున్నవాడు తన చెడులో తానే కాలిపోతాడు; చచ్చినవాడిని చంపటం ఎందుకు?" అనకండి. ఒక్కోసారి దేవుడు కూడా మోసకారుల పక్షమే వహిస్తాడు. తెలివి లేని ఈ కొంగ మన సీమలోనే తిరుగుతూ, ఏ మాత్రం భయమన్నదే లేకుండా ఏకంగా తమరి పాదాలనే తప్పుపడుతూ, అనరాని మాటలన్నీఅన్నది. అందువల్లనే ఈ నీచపు కొంగ వధింపతగినది అయిపోయింది. గిల్లికజ్జాలు పెట్టుకునే ఈ కొంగను చంపెయ్యాలని మేం గట్టి నిశ్చయంతో ఉన్నాం. 'ముక్కుతో పాడవలేని ముంగోపం వల్ల ఏం లాభం?' వీడి పట్ల అణుమాత్రం కూడా దయ చూపవద్దు. తమరి ఆజ్ఞ అయ్యిందంటే తక్షణం వీడిని చంపేస్తాం" అని అన్నీ మూకుమ్మడిగా పలికాయి.

అది విని నా మనస్సు భయానికి పూర్తిగా అధీనం అయిపోయింది. నా శరీరం నిస్సత్తువతోటీ, భయంతోటీ గజ గజా వణకటం మొదలు పెట్టింది. అప్పుడా పక్షుల రాజు చిత్రవర్ణుడు నన్ను దయాపూర్ణమైన దృష్టితో చూస్తూ, నన్ను పొడిచి చంపేందుకు సిద్ధమౌతున్న తన అనుచరులను వారించి

"ఇంతకీ వీడు ఎవ్వడు? ఏ దేశంనుండి వచ్చాడు? చెప్పండి" అన్నది.

అప్పుడా పక్షులు "వీడు హిరణ్య గర్భుడు అనే రాజు అనుచరుడట! కర్పూర ద్వీపం నుండి వచ్చాడట!" అన్నాయి.

అది విని సభలోని వారంతా ఆలోచనలో మునిగారు. ఆ పరిసర ప్రదేశాలన్నీ తిరిగే గ్రద్ద ఒకటి ఆ రాజు వద్ద మంత్రిగా ఉన్నది- దాని పేరు దూరదర్శి- అది నన్ను చూసి "మీ ఆస్థానంలో ప్రధాన మంత్రి ఎవ్వరు?" అని అడిగింది.

(-మిగతాకథ మళ్ళీ...)

---

**తిరగబడిన దాగుడు పక్షులు !**

ఈ వాక్యాలను ఒక్కొక్కదాన్నీ తిరగదిప్పి చదవండి..ప్రతివాక్యంలోనూ ఒక పక్షి దాక్కొని ఉంది, చూడండి!

1. నీటికి కావాలి పల్లం.
2. జోరుగా పరుగెత్తేవాడు ఒక్కమారు ఆగడే.
3. రతి, సరస్వతి తోడికోడళ్ళు.
4. రెండు నెలలయి కోమటి డబ్బు అడుగుతున్నాడు.
5. నీ కోసం హరికోసం కాచుక్కుచున్నాం.
6. వాడివంతు బాగానే ఉంది.
7. చెలిమి నెల వరకు ఎందుకు? ఒక్క రోజులోనే ఏర్పడుతుంది.
8. గొట్టెల తోకలు చిన్నవి.
9. చంద్రుని వద్ద గ్రహం రాహువా? కేతువా?
10. సుశీల యొక్క రాగం కొన వరకు బాగుండదు.

*-1959 సెప్టెంబరు "బాల" (కూర్పు: ఆబోతుల సింహాచలం, పార్వతీపురం)*

1. కాకి 2. డేగ 3. కోడి 4. కోయిల 5. హంస 6. బాతు 7. నెమలి 8. చిలుక 9. గ్రద్ద 10. కొంగ



# పరివర్తన

*పుస్తక ప్రదర్శనలో వచ్చి కూర్చొని దివ్య ఏదేదో రాసేసింది. దాన్ని యధాతథంగా ప్రచురించలేక, ఇలా మార్చాం..ఎలా ఉందో చెప్పండి.*

*మూల రచన:* R.*దివ్య,* 8 *వ తరగతి, జ్ఞానభారతి మోడల్ హైస్కూల్, హైదరాబాదు.*

సుల్తాన్ పురాలో ఉండే అమృత చాలా తెలివైనది. ఆవిడ ఒక ప్రైవేటు బడిలో పనిచేసేది. శ్రద్ధకు, ఓపికకు మారుపేరుగా నిలిచిన అమృత, తన విడి సమయంలో బాగా కష్టపడి చదివి, పరీక్షలు రాసింది- ప్రభుత్వ టీచరు అయ్యింది.

అయితే ఆమె తెలివితేటలు, శ్రద్ధ, ఓపిక ఏమయ్యాయో మరి, ఒకసారి ప్రభుత్వ బడిలో చేరగానే ఆమెలో అనూహ్యమైన పరివర్తన వచ్చేసింది. ఇప్పుడు ఆమె మనసు పాఠాలపైన ఏమాత్రం నిలవటంలేదు. ఎప్పుడూ శలవల గురించీ, తనకు రావలసిన డబ్బుల గురించీ, తోటి ఉపాధ్యాయులకు వచ్చే జీతాలగురించీ, పట్నంలో పెట్టుబడుల గురించీ ఆలోచించటం మొదలు పెట్టింది.

తను ఇప్పుడు ఎనిమిదవ తరగతికి విజ్ఞాన శాస్త్రపు ఉపాధ్యాయురాలు. అయినా ఆమె తరచు క్లాసుకు పోకుండా ఎగగొట్టేది. స్టాఫ్‌రూంలోనే కూర్చొని, 'పనిలో ఉన్నాను- ఊరికే చదువుకుంటూ కూర్చోండి' అని చెప్పి పంపేది. హెడ్మాష్టరుగారి మాటకూడా వినేది కాదు. ఆయన ఏమైనా అంటే 'మేమేమైనా ఖాళీగా ఉన్నామా సార్!?' అని ఎదురుతిరిగేది.

మనసు పాఠాలమీద నిలవకపోవటంతో, రాను రాను ఆవిడ పాఠాల్లోకూడా తప్పులు చోటు చేసుకోవటం మొదలెట్టాయి. కొన్ని పదాలకు ఆవిడ తనకు తెలియకుండానే తప్పు అర్థాలు చెప్పేసేది. ఆమెను ఏమైనా అంటే 'నేను బాగానే చెప్పానమ్మా, మీరు శ్రద్ధగా వినలేదు'అని అందరు పిల్లల్నీ అదిలించేది. అట్లా వాళ్ళ బడి పిల్లల్లో విజ్ఞాన శాస్త్రపు బీజాలు సరిగా పడక, పెద్ద మోసమే అయ్యింది.

ఆమెను గురించి పిల్లలందరూ బాధపడేవారు. వాళ్ళలో ఎవరైనా ప్రధానోపాధ్యాయులకో, వేరే టీచర్లకో ఫిర్యాదు చేస్తే మటుకు ఆమె అస్సలు సహించేది కాదు. ఆ పిల్లల్ని బాగా కొట్టేది, వాళ్ళకు మార్కులు తక్కువ వేసేది.

అయితే ఒక సారి ఏమైందంటే, ప్రభుత్వం వాళ్ళు 'ఏ ఊరి టీచర్లు ఆ ఊర్లోనే నివసించాలి' అని పట్టు పట్టటం మొదలు పెట్టారు. దాంతో అమృత టీచర్ వాళ్ళ కుటుంబం మొత్తం సుల్తాన్‌పురాకు మారాల్సి వచ్చింది. మరి వాళ్ల పిల్లలు- సాయి, రమ్య ఎక్కడ చదవాలి? సాయి ఏడో తరగతి, రమ్య ఎనిమిదో తరగతి! ఇద్దరూ అక్కడి ప్రభుత్వ బడిలోనే చేరారు. అది అమృత టీచర్‌కు అస్సలు ఇష్టం లేకుండింది; కానీ వేరే మార్గం లేదు- ఊళ్లో ప్రైవేటు బడి పరిస్థితి మరీ ఘోరం!

తన పిల్లలు కూడా అదే బళ్ళో చేరే సరికి అమృత టీచర్‌కు పరిస్థితి కొంచెం కొంచెం తెలిసివచ్చింది. అంతకు ముందు బడులలో టీచర్లు రమ్యకు ఏం చెప్పారోగానీ, ఆ పాప చదువులో అన్నీ తప్పులే! సాయికి అయితే ఇంకా తెలుగు చదవటమే రాదు, సరిగ్గా! వాళ్ళని చూసి ఆమె గుండె తరుక్కుపోయింది. ఉపాధ్యాయులు

మనసు పెట్టి చదువు చెప్పకపోతే పిల్లల జీవితాలు ఏమౌతాయనేది ఆవిడకు ఇప్పుడు అర్థం అవ్వసాగింది.

ఇప్పుడు ఆమె మారిపోయింది. పిల్లల్ని బాగా చదివించాలని ప్రయత్నించింది- తన పిల్లల్నే కాదు; బళ్ళో పిల్లలు అందర్నీ! ముందు తను చెప్పే పాఠాల్లో తప్పులన్నిటినీ సవరించుకున్నది. చెబుతున్న విషయాలు అర్థంకాని పిల్లలమీద ప్రత్యేక శ్రద్ధ పెట్టటం మొదలు పెట్టింది. అందరితోబాటు తన పిల్లల్నీ కూర్చోబెట్టి చదివించింది. పిల్లల నోట్సులు దిద్దటం మొదలు పెట్టింది. బడిలో మూలన పడి ఉన్న ప్రయోగశాల దుమ్ము దులిపింది. పిల్లలకు విజ్ఞాన శాస్త్ర ప్రయోగాలు చేసి చూపించింది; వీలైనప్పుడు వాళ్ల చేతనే ప్రయోగాలు చేయించింది. ఇప్పుడు అమృత టీచర్ పాఠాలంటే పిల్లలకు ఎంత ఇష్టమో!

చూస్తూ చూస్తూండగానే పిల్లల్లోనూ మార్పు వచ్చింది. వాళ్ళలో కొందరు మెరికల్లాగా తయారయ్యారు. పరీక్షల్లో మంచి మార్కులు సంపాదించుకోవటమే కాదు; వైజ్ఞానిక ప్రదర్శనల్లోనూ పాల్గొనటం మొదలు పెట్టారు. రమ్య, సాయి బడినుండి బయటకి వచ్చి బాధ్యత గల పిల్లలుగా కాలేజీల్లో చేరారు.

'సైన్సు నేర్చుకోవాలంటే అమృత టీచర్ దగ్గరికే వెళ్ళాలి' అని జిల్లా అంతటా మారు మ్రోగింది. అమృత టీచర్ వళ్ళోకి ఏవేవో అవార్డులు వచ్చిపడ్డాయి. అయినా అవేవీ ఆవిడను ఆకర్షించటం లేదు- పిల్లలకు చక్కగా పాఠాలు చెప్పటం అంటే ఇప్పుడు ఆమెకు ఎంత ఇష్టమో చెప్పలేం!



**జోకు**

అనంతరామన్ సుబ్బరామన్ ఓ గొప్ప ప్రైవేటు బ్యాంకుకెళ్లాడు. బ్యాంకులో పని చేసేదంతా ఇంగ్లీషు వాళ్ళే. తను ఓ డిడి కోసం డబ్బులు కట్టి కూర్చున్నాడు. రెండు గంటలు గడిచాయి. ఇంకా పిలుపురాలేదు. చివరికి విసుగొచ్చింది, వెళ్లి నిలదీశాడు అక్కడి క్లర్కును.

"రెండు గంటల్నుండీ పిలుస్తున్నా, మీరే రాలేదు సార్ "అన్నాడతను మర్యాదగా

మళ్లీ ఓ సారి పిలుస్తాను చూడండి. పిలిచాడు- " అనదర్మ్యాన్, సూపర్మ్యాన్!! (Another man Super man)" అని!!

*సేకరణ: సుధీర్, బెంగులూరు.*



# సహాయం

*రచన: విశాల్‌గల్లా, 6 వ తరగతి, రిషివ్యాలీస్కూల్, మదనపల్లి.*

చాలా రోజుల క్రితం ఒక అబ్బాయి ఉండేవాడు. వాడి పేరు రాజు. వాడు అందరి దగ్గర నుంచి డబ్బులు తీసుకొని హాయిగా బతికేవాడు. ఎప్పుడు చూసినా తింటూ , పాటలు పాడుతూ ఉండేవాడు. ఎవరికీ ఏ సహాయమూ చేసేవాడు కాదు. ఏమైనా అడిగితే తిట్టేవాడు. తోటి వాళ్ళెవ్వరికీ వాడంటే ఇష్టం ఉండేది కాదు. ఒక్క శంకర్ మటుకు వాడి దగ్గర మంచి జోకులువేసేవాడు. రాజు ఆ జోకులకు బాగా నవ్వేవాడు. ఇలా చాలా రోజులు నవ్వించి, శంకర్ చెప్పాడు: "రాజూ, నువ్వు ఇంత చక్కగా నవ్వుతావు, కానీ మరి అందరికీ ఎందుకు సహాయం చేయవు?" అని. వెంటనే రాజుకి కోపం వచ్చేసింది. శంకర్‌తో మాట్లాడటంమానేశాడు.

ఇలా ఉండగా ఆ ఊళ్ళో ఎందుకనో, విష జ్వరాలు మొదలయ్యాయి. రాజుకి కూడా జబ్బు చేసింది. ఊళ్ళో వైద్యులు అందరికీ వైద్యం చేసారు- కానీ రాజుకి మాత్రం చేయలేదు! రాజు ఎంత అడిగినా చేయలేదు; డబ్బులు ఎక్కువ ఇస్తానన్నా ఎవ్వరూ వైద్యం చెయ్యలేదు!

పాపం, దాంతో రాజుకి జబ్బు చాలా ఎక్కువ అయిపోయింది. ఆరోజు రాత్రి వాడికి జ్వరం బాగా ఎక్కువయ్యేసరికి, దాన్ని గమనించి తోటివాళ్ళు వాడిని ఎత్తుకొని డాక్టర్ల దగ్గరికి తీసుకెళ్ళారు. డాక్టర్లు వెంటనే వైద్యం మొదలు పెట్టారు; జ్వరాన్ని అదుపులోకి తెచ్చారు.

మళ్ళీ తెల్లవారేసరికి రాజు జ్వరం తగ్గింది; కానీ ఇంకా చాలా నీరసంగా ఉన్నాడు. వైద్యులు అన్నారు- "ఇక నువ్వు ఇంటికి వెళ్ళిపో. నీకు మాతో అవసరం ప్రస్తుతానికి తీరిపోయినట్లే. అయినా నువ్వు ఎవ్వరికీ సాయం చెయ్యవు, మరి మీ మిత్రులు నీకు ఎందుకు సాయం చెయ్యాలి? నిన్ను వాళ్ళు ఇక్కడికి ఎందుకు తేవాలి?!" అని.

రాజుకి అప్పుడు చాలా సిగ్గు అనిపించింది. అతను అన్నాడు- "నన్ను మన్నించండి. దయచేసి నాకు సహాయం చేయండి. నా ప్రవర్తన సరిగా లేదు అని అర్థం అయింది. ఇకమీద నేనూ వేరేవాళ్ళకు సాయం చేస్తాను" అని.

వైద్యులు హాయిగా నవ్వారు. "నీకు బుద్ధి రావాలనే ఇట్లా చేసాం, నిజానికి నువ్వంటే మాకు చాలా ఇష్టం" అన్నారు. వాడిని ఇంకొన్ని రోజులు ఆసుపత్రిలోనే ఉంచుకొని వైద్యం చేసారు.

జ్వరం బాగైంది. అయితే రాజుకి అంతకంటే మేలు జరిగింది- 'ఇతరుల సహాయం లేకుండా మనం బతకలేము' అని అర్థమైంది వాడికి.

ఆ తరువాత రాజు అందరికీ సహాయం చేస్తూ హాయిగా బ్రతికేసాడు. 



# ఇష్టంతో చేస్తే

*కథనం: సింగీతం ఆనంద్, 4 వతరగతి, శాంతినికేతన్ విద్యాలయం, జహీరాబాద్.*
*సౌజన్యం: జహీరాబాద్ పిల్లల కథలు, మన లైబ్రరీ, జహీరాబాద్.*



రావులపాలెంలో క్రొత్తగా పాఠశాల భవన నిర్మాణం మొదలైంది. గోపాల్, రాజు, మాధవ్ అనే ముగ్గురూ కూలీలుగా పనిచేస్తున్నారు.

గోపాల్ ఎప్పుడూ విచారంగా పనిచేసేవాడు. రాజు ముఖంలో ఏ భావమూ కనబడేది కాదు; నిర్లిప్తంగా తన పని తాను చేసుకునేవాడు. ఇక మాధవ్ మాత్రం ఎప్పుడు చూసినా చలాకీగా, నవ్వుతూ -తుళ్లుతూ పనిచేస్తుండేవాడు.

పాఠశాల నిర్మాణాన్ని పర్యవేక్షించే శ్రీనివాస్ మంచివాడు. మానవుల స్వభావాన్ని అర్థం చేసుకోవటం అంటే అతనికి ఇష్టం. రోజూ ఈ ముగ్గురి పని తీరునూ చూసి చూసి ఒకరోజున శ్రీనివాస్‌కు వాళ్ళతో పనితీరుల గురించి

మాట్లాడుదామనిపించింది.

అతను గోపాల్ దగ్గరికెళ్ళి కూర్చొని "నువ్వెందుకు గోపాల్, ఎప్పుడూ బాధపడుతుంటావు?!" అని అడిగాడు.

"ఈ కూలిపని చేయటం నాకు అస్సలు ఇష్టం లేదు. చదువుకోలేదుగా, అందుకని నా ఖర్మకొద్దీ చేయాల్సివస్తోంది. ఇక సంతోషంగా ఎలా ఉంటాను?" అన్నాడు గోపాల్ .

శ్రీనివాస్ అతని పట్ల సానుభూతి ప్రకటించాడు. "ఏం చేస్తాం, తప్పదు!" అన్నాడు.

ఆ తరువాత అతను రాజు దగ్గరకు వెళ్లి కూర్చున్నాడు. "నీకేమైనా ఇబ్బందులు ఉన్నాయా, అంత నిర్లిప్తంగా ఉంటావు?" అన్నాడు.

"ఎండలో పని చేయడమేనయ్యా, ఇబ్బందంతానూ. ఏదో, నా భార్య పిల్లల్ని పోషించుకోవాలిగదా అని ఈ పని చేస్తున్నాను కానీ, ఈ పనంటే ఎవరికి ఇష్టం ఉంటుంది?!" అన్నాడు రాజు.

"అవునవును!" అన్నాడుశ్రీనివాస్.

చివరగా అతను మాధవ్ దగ్గరికి వెళ్ళాడు- "నువ్వు సంతోషంగా ఎలా ఉండగల్గుతున్నావు మాధవ్? ఈ కూలిపని వల్ల ఎక్కువ డబ్బులు రావుగా?" అని అడిగాడు.

"నాకు చిన్నప్పటి నుండి చదువుకోవాలనే కోరిక బలంగా ఉండేది. కానీ మా ఊళ్లో బడి లేదు. నన్ను వేరే ఊరికి పంపించి చదివించే స్థోమత లేదు, మా అమ్మా నాన్నలకు. దాంతో చదువుకోవాలనే కోరిక అసలు ఏమాత్రం తీరలేదు. అయితే ఇప్పుడు చూడండి, నేను చదువుకోలేకపోయినా, ఈ ఊరి పిల్లలందరూ చదువుకునే బడిని నిర్మించే అవకాశం నాకు వచ్చింది! ఎంత సంతోషకరమైన సంగతి ఇది!" అన్నాడు మాధవ్.

"నీకు దక్కని చదువు కూడా ఇతరులకు దొరుకుతుందని సంతోషంగా పనిచేస్తున్నావు. నీ నుండి నాలాంటి వాళ్లు చాలా నేర్చుకోవాలి. మరి ఇంతకు ముందు పనిని కూడా నువ్వు సంతోషంగానే చేసావుగా, అదెట్లాగ?"

అడిగాడు శ్రీనివాస్ అతన్ని.

"పాపం, ఆ సారు జీవితమంతా కష్టపడి వెనకేసుకున్న నాలుగు డబ్బులతో ఇల్లు కట్టుకున్నాడు. ఆయనకు ఇల్లు కట్టి పెట్టిన పుణ్యమంతా నాదేగద! ఇక ఏం బాధ!" అన్నాడు మాధవ్ నవ్వుతూ.

"ఓహో! నువ్వు చేసే ప్రతి పనీ నీకు సంతోషాన్నే ఇస్తుందన్నమాట! బాగుంది, బాగుంది!" అన్నాడు శ్రీనివాస్ ఆలోచనలో పడుతూ.



---

## సరైన లెక్క!

జోకు

టీచర్: నీ దగ్గర నాలుగు చాక్లెట్లున్నాయనుకో, నేను నిన్ను 3చాక్లెట్లు నాకు ఇచ్చెయ్యమన్నాననుకో? అప్పుడు నీ దగ్గర ఇంకా ఎన్ని చాక్లెట్లు మిగులుతాయి?

రాజు: నాలుగు!!

టీచర్: ఆం..! అదెలాగ?!

రాజు: మీరు చాక్లెట్లు ఇమ్మనగానే ఇచ్చేసేందుకు నేనేమైనా తెలివి తక్కువ వాడిననుకుంటున్నారా?

నాపేరు గోపాల్
నాన్న పేరు భూపాల్
పుట్టింది నేపాల్
తాగింది ఆవుపాల్
చేసింది పాపాల్
అయ్యాను జైల్‌పాల్

*సేకరణ: సమీర,6th, రిషివ్యాలీ.*

## వస్తు మార్పిడి!

జోకు

సురేష్: నాకు రాన్రాను మతిమరుపు ఎక్కువైపోతోంది, ఏం చేయాలో అర్థం కావట్లేదు.

వినయ్: ఏమైందిరా?

సురేష్: గుడికి వెళ్ళి వచ్చేటప్పుడు మళ్ళీ పొరపాటున నా పాత చెప్పులే తొడుక్కొచ్చాను.




# చెడపకురా, చెడేవు!

*ఆధారం: బి. సాయికుమార్, 8 వతరగతి*, z.p.h.school, *చెన్నేకొత్తపల్లి. కథనం: కొత్తపల్లి*

సోమందేపల్లిలో నివసించే సోమయ్య మంచి రైతు. అయితే చాలా అమాయకుడు.

సోమయ్య ఇంటిని ఆనుకొనే నివసిస్తున్నారు- హరీష్, నవీన్. వీళ్ళు అతితెలివిగాళ్ళు. వీళ్లకి ఎప్పుడూ సోమయ్యను ఏడిపించాలని ఉంటుంది.

సోమయ్య ఒకసారి మడి దున్ని, వరి పొలం పెట్టాడు. హరీశ్, నవీన్‌ల చూపు ఆ పొలం మీద పడ్డది. దాన్ని పట్టుకొని ఎలాగైనా సోమయ్యను ఏడిపించాలని ముచ్చట పడ్డారు వాళ్ళు.

ఆరోజున సోమయ్య మడికి మందులు చల్లి, నీళ్ళు పెట్టి ఇంటికి రాగానే వీళ్ళిద్దరూ మడి దగ్గరికి వెళ్ళారు. మడి పచ్చగా కళ కళ లాడుతోంది. వీళ్ళు ఒకరి మొహాలు ఒకరు చూసుకొని, అటువైపు వస్తున్న నీళ్లను వేరేవైపు

మళ్ళించారు. అంతలో వాళ్ల దృష్టి అక్కడ పెట్టి ఉన్న డబ్బా మీద పడింది- "ఒరే, దీన్ని చూసేసరికి నాకు దొడ్డికి పోవాలనిపిస్తున్నదిరా, అన్నాడు హరీష్.

"నువ్వు డబ్బా తీసుకొని అటువైపుకు పో, నేను ఆలోపల ఇక్కడ ఇంకా ఏం చెయ్యచ్చో చూస్తాను" అన్నాడు నవీన్.

హరీశ్ అటు వెళ్ళగానే వాడు అటూ ఇటూ చూశాడు. శుభ్రంగా తళతళలాడుతున్న కొత్త స్విచ్ బోర్డు ఒకటి వాడి దృష్టిని ఆకర్షించింది. దాన్ని చూడగానే వాడికొక ఆలోచన వచ్చింది- ఆ స్విచ్ బోర్డుకు నాలుగు స్విచ్‌లు ఉన్నై. రెండు ఆన్ చేసి ఉన్నై; రెండు ఆఫ్ చేసి ఉన్నై. వాడు వెకిలిగా నవ్వి, ఆఫ్ లో ఉన్న స్విచ్‌లు రెండింటినీ ఆన్ చేసాడు; ఆన్‌లో ఉన్న రెండింటినీ ఆఫ్ చేసాడు. "సోమయ్య వచ్చి చూస్తే కరెంటు గందరగోళంగా ఉంటుంది. వాడికి ఏమీ అర్థం కాదు. అప్పుడు వాడు ఎట్లా తన్నుకులాడతాడో చూస్తే మజా వస్తుంది!" అని వాడు సంబరపడుతున్నంతలోనే దొడ్డికి పోయి వస్తున్న హరీష్ ప్రాణం పోయినట్లు "ఓ..ఓ..ఓ" అని అరవటం వినబడ్డది. బయటికి వెళ్ళి చూస్తే ఏముంది?- హరీష్ క్రిందపడి తన్నుకులాడుతున్నాడు! వాడి చేతికి ఒక కరెంటు తీగ చుట్టుకుపోయి ఉన్నది!

ఒక క్షణం పాటు నవీన్ తల తిరిగిపోయింది. అయితే మరుక్షణం వాడికి అర్థమైంది- ఇదేదో తను చేసిన పని ఫలితమేనని! వెంటనే వాడు స్విచ్‌బోర్డు దగ్గరికి పరుగెత్తి స్విచ్‌లను అంతకు ముందు ఉన్నట్లు సరిచేశాడు. దాంతో హరీష్ తన్నుకులాడటం ఆగింది. అటుపైన నవీన్ గబగబా హరీష్ దగ్గరికెళ్ళి, తను చేసిన ఘనకార్యం చెప్పకుండా, "ఈవైరు ఎందుకు ముట్టుకున్నావురా, ఊరికే!?" అన్నాడు. "సోమయ్యగాడికి తిక్క పుట్టించేట్లు, ఈ తీగనొకదాన్ని తెంపేద్దామనుకున్నాను. దానిలో కరెంటు ఉందని నాకు తెలీలేదు!" అన్నాడు హరీష్.

"పోనీలే ప్రాణాలైనా దక్కాయి" అని ఇద్దరూ గబగబా ఇంటి దారి పట్టారు. ఆ హడావిడిలో ఇంకా చేను దాటకనే ఇద్దరూ జారి ఒక

గుంతలో పడ్డారు. వీళ్ళకోసమే ఎదురు చూస్తున్నట్లు అక్కడున్న తేళ్ళు రెండు వీళ్ళను కసితీరా కుట్టాయి!

తేలు కుడితే సామాన్యంగా ఎవ్వరివీ ప్రాణాలు పోవు- కానీ ఆ విషం శరీరంలో ఉన్నంత సేపూ మనిషి నాట్యం చేస్తూనే ఉంటాడు- అది అట్లా అల్లల్లాడిస్తుంది. ఇంక వీళ్ళిద్దరూ నాట్యం చేసుకుంటూ రోడ్డు మీద పోతుంటే చూసిన వాళ్ళంతా "ఏమైందిరా, ఏమైందిరా" అని అడగటం మొదలుపెట్టారు.

"మరే మరే.." అని నవ్వుతారు, ఏడుస్తారు- తప్పిస్తే ఇద్దరూ ఏం జరిగిందోమటుకు ఎవ్వరికీ చెప్పటం లేదు.

త్వరలోనే వీళ్ల వెనక నవ్వుతూ, ఏడుస్తూ నడిచే పిల్లల బృందం ఒకటి తయారైంది. వీళ్ళు ఏడిస్తే వాళ్ళు నవ్వుతున్నారు. వీళ్ళు నవ్వితే వాళ్ళు ఏడుస్తున్నారు. అందరూ గంతులు వేస్తున్నారు!

కొంచెం సేపు వీళ్ళ సందడిని వినోదంగా చూసిన పెద్దవాళ్ళు, ఆ తర్వాత వీళ్ళిద్దరినీ ఆపి ఏం జరిగిందో అడుగుదామని చూశారు. కానీ వీళ్ళు ఎక్కడైనా నిలిస్తేగా!? అయితే వీళ్లకంటే తొందరగా ఆ వార్త వీళ్ళ ఇల్లు చేరింది.

హరీశ్, నవీన్‌ల ఇంట్లోవాళ్ళు అందరూ ఆ సమయానికి సోమయ్య ఇంట్లోనే ఉన్నారు. ఏమంటే అక్కడికి ఒక స్వామీజీ వచ్చి ఉన్నారు. ఆయనకు చాలా మహిమలు ఉన్నాయనీ, ముఖ్యంగా ఆయన ఒక సారి ముట్టి, మందిస్తే ఎలాంటి ముదిరిన పిచ్చైనా దెబ్బకు వదిలిపోతుందనీ ఆయన్ని అందరికీ పరిచయం చేస్తున్నాడు సోమయ్య.

సరిగ్గా అప్పుడే హరీశ్, నవీన్‌ల నాట్యం సంగతి వాళ్లకు తెలియవచ్చింది. వాళ్ళ పేరు వినగానే స్వామీజీ ఉత్సాహంగా కళ్ళు మూసుకొని "అదే, అదే! కర్మ ఫలం! తెండి! వాళ్ళను నా దగ్గరికి తెండి!" అన్నాడు, తనూ ఎగురుతూ. చుట్టూ చేరినవాళ్ళు 'ఇదే సందురా, వినోదం చూసేందుకు' అని బయటికి పరుగెత్తి, అప్పటికే ఇల్లు చేరుతున్న హరీశ్, నవీన్ లను పెడరెక్కలు విరిచి లాక్కొచ్చారు సోమయ్య ఇంటికి.

అంత గడబిడలోనూ హరీశ్, నవీన్‌లకు

చెమటలు పట్టాయి. తాము చేసిన తప్పు పని అంత త్వరగా సోమయ్యకు ఎలా తెలిసిపోయిందో వాళ్ళకు అర్థం కాలేదు. సోమయ్యకు ఏమీ తెలీలేదని వాళ్ళకు ఇంకా అర్థం కాకనే, స్వామీజీ వాళ్లను లాగి ఇంటి మధ్యలో నిలబెట్టాడు. తేలు విషం ఇంకా దిగలేదుగా, వీళ్ళ కాళ్ళు, చేతులు వణుకుతూనే ఉన్నై, వీళ్ళ నాట్యం కొనసాగుతూనే ఉంది. దాంతో స్వామీజీకి ఆలోచన వచ్చి తనూ నాట్యం మొదలు పెట్టాడు భయంకరంగా, శివుడిలాగా. చుట్టూ చేరిన భక్తులంతా "కొబ్బరికాయలు తెండి, చిల్లర డబ్బులు తెండి" అని అరిచారు. హరీశ్, నవీన్‌ల తల్లిదండ్రులు గబగబా ఇంటికి పరుగెత్తి చేతికందిన డబ్బులు, పళ్ళు, ఫలాలు తెచ్చివ్వక తప్పలేదు!

ఇట్లా కొంతసేపు జరిగాక, స్వామీజీ శాంతించి, పళ్ళు నూరుతూ "ఒరే! కర్మ ఫలం చూశారా! ఎవరు చేసిన పనికి ఫలితం వాళ్ళు అనుభవించాలిరా! మీరంతా తేలు కుట్టిన దొంగలు! ఏమీ చెప్పుకోలేరు! ఊరుకోండి! నాట్యం ఆపండిరా! స్వామికి ఒక పాడిఆవుని సమర్పించుకోండి! పాపభారం ఊరికే పోదు; దానం చేయాల్సిందే" అని అరిచాడు.

దాంతో హరీశ్, నవీన్‌లకు మరిన్ని డబ్బులూ, మంచి పాలిచ్చే ఆవూ వదిలిపోయాయి. డబ్బులు వదిలిన విచారం ఎక్కువయ్యేసరికి వాళ్లకెక్కిన తేలు విషం ప్రభావం కూడా తగ్గింది!

"చూశారా చూశారా! స్వామీజీ ఎంత మహిమగలవారో! క్షణంలో బాగుచేసేశారు!" అన్నారు ఊళ్ళో జనాలు.

"ఎలా కనుక్కున్నాడు, తేలు సంగతి కూడా చెప్పేశాడే! నిజంగానే మహాత్ముడేమో!" అనుకున్నారు హరీశ్, నవీన్.

"ఇంతకీ ఏం పిచ్చో, వీళ్ళకి? కనీసం ఇప్పటికి శాంతించారు అంతే చాలు- పాడిఆవు గిట్టుబాటే!" అనుకున్నారు స్వామీజీ, చెదరని చిరునవ్వుతో.

ఇవేవీ తెలీని సోమయ్య పొలంలో నీళ్ళు మరో ప్రక్కకి మళ్ళించేందుకు పరుగుపెట్టాడు! ✷



# మంచి మాటల మహిమ



*రచన: టి.వేణుగోపాల్, 5 వతరగతి, ప్రభుత్వప్రాథమికపాఠశాల, నడిమిదొడ్డి, నార్పల.*

అనగనగా ఒక రాజ్యం. ఆ రాజ్యపు యువరాజు కాంతిసేనుడు చాలా చురుకైనవాడు. ప్రజల కష్టాల్ని తీర్చడానికి ఎటువంటి సాహసానికైనా సిద్ధపడేవాడు. ఒకసారి ఆ రాజ్యంలో వరసగా మూడేళ్ళు వర్షాలు కురవలేదు. కరువు వల్ల ప్రజలు ఎన్నో ఇబ్బందుల పాలవుతున్నారు. రాజుగారు కరువు నివారణకోసం రకరకాల పనులు చేపట్టారు.

ఒకరోజున ఆయన సభలోని వారందరినీ అడిగారు-'సమృద్ధిగా వర్షాలు కురవాలంటే ఏం చేయాలి?'అని.

"చెట్లునాటాలి" అన్నారొకరు. "అడవులు పెంచాలి" అన్నారొకరు. "తపస్సు చెయ్యాలి" అన్నారొకరు.

"ఈ సంవత్సరమే వానలు పడాలంటే ఏం

చేయచ్చో చెప్పండి" అన్నాడు మహారాజు.

రాజగురువు ముందుకు వచ్చాడు. తను శాస్త్రాల్లో వెతికి కనుగొన్న విషయాన్ని చెప్పాడు- "రాజ్యానికి చాలా దూరంలో దట్టమైన అడవి ఉంది. ఆ అడవిలో ప్రత్యేకమైన వృక్షం ఒకటి ఉంది. దాని కొమ్మను తీసుకువచ్చి నాటితే చాలు- వెంటనే వర్షాలు కురుస్తాయి" అన్నాడు.

"నిజంగానా?" అడిగారు రాజుగారు.

"శాస్త్రాల్లో అలా ఉంది. అవి నిజమో, కాదో నేను చెప్పలేను" అన్నాడు రాజ గురువు.

"సరే, చూద్దాం. ఎవరు తెస్తారు?" అని రాజుగారు అన్నారో లేదో- చాలా మంది యువకులు ముందుకొచ్చారు. 'నేనంటే నేను' అని పోటీపడ్డారు.

రాజుగారు ఒక్కొక్కరినీ అడవిలోకి పంపించాడు.

అందరూ ముఖాలు వేళ్ళాడేసుకొని వెనక్కి వచ్చారు.

"ఆ చెట్టు కొమ్మను కొట్టటం మా వల్ల కాలేదు. దానికేవో మాయలున్నట్లున్నై. మేం ఎన్ని రకాలుగా నరికేందుకు ప్రయత్నించినా అది తెగనే లేదు!" అన్నారు వాళ్ళు.

యువరాజు కాంతిసేనుడు ముందుకు వచ్చాడు. "నేనే తెస్తాను" అని బయలుదేరి వెళ్ళాడు.



గురువుగారు చెప్పిన ఆనవాళ్ళ ప్రకారం అడవిలోకి వెళ్ళాడు కాంతిసేనుడు. అంతమంది త్రొక్కిన దారేగా, ఆ వృక్షం తేలికగానే దొరికింది.

కాంతిసేనుడు దాని ముందు నిలబడ్డాడు గొడ్డలి చేత బట్టుకొని. ఒక నిముషంపాటు

ఆలోచించాడు- "ఇది మహిమ గల వృక్షం. దీని కొమ్మను గొడ్డలిద్వారా సంపాదించలేం. ఏవో మంత్రాలు ఉండి ఉంటాయి" అనుకున్నాడు. గొడ్డలిని క్రింద పడేసాడు. చేతులు జోడించి రకరకాల దేవతల్ని ప్రార్థించాడు. ఎన్ని మంత్రాలు చదివినా ఏమీ ప్రయోజనం అయితే కలగలేదు.

ఆఖరికి కాంతిసేనుడు చెట్టు ముందు మోకరిల్లాడు- "ఓ వృక్షమా! దయచేసి నాకు సహాయం చేయవా!" అని ప్రాధేయ పడ్డాడు. ఆశ్చర్యం! మరుక్షణం ఆ చెట్టు నవ్వింది! కొమ్మల్ని గల గల లాడించింది. "చేస్తాలే, చేస్తాలే" అన్నట్లు వీచింది గాలి.

కాంతి సేనుడికి చాలా సంతోషం వేసింది. "ధన్యవాదాలు, చెట్టూ!" అన్నాడు. ఆ మాటలు అన్నాడోలేదో, ఒక కొమ్మ తనంతట తానే తెగిపడ్డది కాంతిసేనుడి ముందు.

'దయచేసి' 'ధన్యవాదాలు' అనే మాటలు రెండూ చాలా శక్తివంతమైనవని గ్రహించాడు కాంతిసేనుడు.

చెట్టుకు మరోసారి ధన్యవాదాలు తెలిపి, ఆ కొమ్మను తీసుకెళ్ళి రాజ్యంలో నాటాడు. కొమ్మను నాటిన రెండు రోజుల్లోనే వర్షాలు కురిసాయి! రాజ్యంలోని చెరువులన్నీ నిండాయి!

మంచి మాటలు కత్తివేటు కంటే బలమైనవని అర్థమైన యువరాజు అటుపైన వాటిని తన నిత్య జీవితంలో వాడటం మొదలు పెట్టాడు- కాలక్రమంలో అందరూ ' మా మహారాజు చాలా మంచివాడు!' అనుకునేట్లు ఎదిగాడు.



---

జోకు

**నిద్ర మందు!**

తండ్రి: పడుకొని కూడా పుస్తకాలు చదువుతున్నావురా! ఎంత మంచి వాడివి, నువ్వు!

కొడుకు (మనసులో): ఇవి చదువుతుంటే నిద్ర బాగా వస్తుంది నాన్నా, అందుకని..!

# బొమ్మకు కథ రాయండి!

*నిర్వహణ: శ్రీమతి జి.లలిత*, telugu4kids.com

ఈ బొమ్మను చూడండి.. ఏం జరుగుతోంది?



అమ్మ, అవ్వ, బాబు- అందరూ కలిసి ఎక్కడికో బయలుదేరి పోతున్నట్లున్నారే, గాడిదనూ వెంటబెట్టుకొని పోతున్నారా? మీకు తెలుసా వాళ్ల కథ? తెలిస్తే మాకు రాసి పంపండి. బాగున్న కథని రెండు నెలల తర్వాత కొత్తపల్లిలో ప్రచురించి, ఒక కాపీ మీకూ అందిస్తాం!

మీ కథలు పంపాల్సిన చిరునామా:

కొత్తపల్లి బృందం, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101




# సాహస యాత్ర

రచన: కార్తీక్, పదవ తరగతి, విద్యార్థి సృజనకుటీర్, విజయవాడ.

అదో అమావాస్య రాత్రి. కెప్టెన్ డిక్సన్ తన చురుకైన కళ్లతో తమను చుట్టుముట్టిన కటిక చీకట్లోకి తీక్షణంగా చూస్తున్నాడు. ఇప్పుడు అతని చూపుకు పొగమంచు కూడా అడ్డుపడటం మొదలెట్టింది. ఆ పడవలో అతనితోపాటు అర్జున్ సింగ్, చందన్ దాస్ అనే కళాసీలు ఇద్దరు మాత్రం ఉన్నారు- ఇద్దరూ నీరసంగా పడుకొని ఉన్నారు.

ఆ సమయంలో ఎలాంటి ప్రమాదం తలెత్తినా తన సహచరులను హెచ్చరించేందుకు, ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉన్నాడు కెప్టెన్ డిక్సన్. అలా కాపలా కాస్తున్న అతను విశ్రాంతి తీసుకుంటున్న తన సహచరులవైపు చూసి గాఢంగా నిట్టూర్చాడు. అప్పటివరకు జరిగిన సంఘటనలు అతని కళ్ళముందు కదలాడాయి.

******

అది వసంతం. గాలులు అద్భుతంగా వీస్తున్నాయి. జోరుగా వీస్తున్న సముద్రపు గాలి అందరిలోనూ ఉత్సాహాన్ని పెంచుతోంది. కళాసీలు "బాద్‌షా"ని వస్తు సామగ్రితో నింపుతున్నారు. ఒక్కో కళాసీ ఆరోగ్యాన్ని నిశితంగా పరీక్షిస్తున్నాడు కెప్టెన్ డిక్సన్. "బాద్‌షా" బ్రిటిష్ ఇండియా వారి యుద్ధనౌక. ఆరోజునే అది ఇంగ్లండుకు పయనం అవుతున్నది. 1000 టన్నుల పట్టు, 200 టన్నుల వెండి, 100 టన్నుల బంగారం, ఇంకా పెద్ద మొత్తాలలో సుగంధ ద్రవ్యాలు అందులో నింపబడ్డాయి. బాద్‌షా వాటినన్నిటినీ ఇంగ్లండుకు చేర్చవలసి ఉన్నది: ఇది అందరికీ తెలిసిన నిజం.

కానీ బాద్‌షా అసలు కర్తవ్యం అది కాదు.

ఎన్నో వందల సంవత్సరాల క్రితం దాచబడిన చోళుల గుప్తధనరాశి ఒకటి ఈ మధ్యనే బయటపడింది. దాని విలువ వెల కట్టలేనిది. అందులోని రత్నరాశి అమూల్యమైనది. దాన్ని ఎవరికీ తెలియకుండా బ్రిటన్‌కు చేరవేయటం బాద్‌షా కర్తవ్యం...

అర్జున్ సింగ్ ఇంకా ఆలోచనల్లో ఉండగానే బాద్‌షాకు దగ్గర్లో వచ్చి ఆగిందొక నల్ల గుర్రపు బగ్గీ. దాని వెనకే వందమంది సైనికులు వచ్చారు. అర్జున్‌సింగ్, మరో ముగ్గురు సైనికులు కలిసి బగ్గీలోంచి ఒక బరువైన ఇనుప పెట్టెను దింపారు. దాన్ని మోసుకెళ్ళి బాద్‌షాలో దానికి కేటాయించబడిన గదిలో దాన్ని భద్రం చేశారు. ఆపైన ఆ గది బయట ఇద్దరు సైనికులు కాపలాగా నిలబడ్డారు.

నిర్ణీత సమయానికి "బాద్‌షా" కూత వేసింది. అందరూ ఓడపైకి చేరుకున్నారు. బాద్‌షాపైన ఈసారి మొత్తం 180 మంది ప్రయాణించబోతున్నారు. వాళ్లలో వంద-మంది సైనికులు, మిగిలిన 80 మందీ కళాసీలు.

కెప్టెన్ డిక్సన్‌కు తప్ప, వీళ్ళలో ఎవ్వరికీ తమ పర్యటనలోని అసలు రహస్యం తెలీదు!

కళాసీలు వారి వారి స్థానాల్లోకి వెళ్ళగానే తెరచాపలు విచ్చుకున్నాయి. కొద్ది క్షణాల్లోనే అవి తమ నిండా గాలిని నింపుకున్నాయి..బాద్‌షా బరువుగా కదిలి తన

ప్రయాణాన్ని మొదలుపెట్టింది.

ఇందులో ఎవరికీ సముద్ర ప్రయాణం కొత్తకాదు. ప్రయాణం జోరుగా సాగుతున్నదని అందరూ ఉత్సాహపడు-తున్నారు- వాళ్లకు ఎదురవ్వనున్న ప్రమాదం గురించి పాపం, వాళ్లెవ్వరికీ తెలీదు.



ఆరోజు సాయంత్రం తెరచాప త్రాళ్లను పరిశీలిస్తున్న ఓ కళాసీకి దూరంగా సముద్రంలో ఏదో నలుసులాంటి వస్తువు దర్శనమిచ్చింది. నిముష నిముషానికి అది పెద్దదైంది..చాలా వేగంగా అది వాళ్లవైపుకు దూసుకు రాసాగింది. 'అదొక యుద్ధనౌక' అని కళాసీ గుర్తించే సరికి అది చాలా దగ్గరికే వచ్చేసింది. దానిమీద ఉన్న జెండాను చూసేటప్పటికి అతనికి మూర్ఛ వచ్చినంత పనైంది- "సముద్రపు దొంగలు! సముద్రపు దొంగలు!" అన్న వెర్రికేక వెలువడింది అతని నోట్లోంచి!

బాద్‌షా మీద ఉన్న సైనికులందరినీ బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం ఏరి కోరి ఎంపిక చేసుకున్నది. ప్రమాద సమయాల్లో ఏం చేయాలో వాళ్లకు బాగా తెలుసు. కళాసీలందరూ వారి వారి స్థానాల్లో నిలబడి ఆదేశాలకోసం చూస్తుంటే సైనికులందరూ తమ తమ ఆయుధాలను సరిచూసుకున్నారు. కొందరు తుపాకీలను ఎక్కుపెట్టారు; మరికొందరు ఫిరంగులను సిద్ధంచేశారు.

శత్రునౌక దగ్గరవ్వగానే వాళ్లకు అర్థమైంది- తాము ఎదుర్కోబోతున్నది అతి గొప్ప సముద్రపు దొంగ- "బ్లాక్‌బియర్డ్"ని!

అతన్ని చూడగానే కెప్టెన్ డిక్సన్ గుండె జారిపోయింది. వెంటనే తన కాబిన్ లోకి పరుగెత్తి బ్రిటిష్ఇండియా గవర్నమెంటు వారికి

టెలిగ్రాఫ్ ద్వారా సందేశం పంపాడు- దాడి గురించి, బాద్‌షా ప్రస్తుతం ఉన్న చోటు అక్షాంశ-రేఖాంశాలగురించి- వీలైనంత త్వరగా సహాయాన్ని పంపమని జోడించాడు.

కెప్టెన్ డిక్సన్‌కు తెలుసు- బ్లాక్ బియర్డ్ వచ్చింది బంగారం కోసం కాదు- వెలకట్టరాని గుప్తధనరాసి బాద్‌షా మీద ఉన్నదని అతనికి ఎలాగో తెలిసిపోయి ఉండాలి!

కెప్టెన్ డిక్సన్ బయటికి వచ్చేసరికి అరుపులు, కేకలు, తుపాకి కాల్పులు, ఫిరంగి మ్రోతలతో నౌకలు రెండూ దద్దరిల్లుతున్నాయి. వాటన్నిటి నడుమ పరుగెత్తుకుంటూ గుప్త ధనం ఉన్న కేబిన్‌కు వెళ్ళాడు కెప్టెన్ డిక్సన్. క్యాబిన్‌కు కాపలా కాస్తున్న నలుగురు సిపాయిలనీ, తనకు నమ్మకస్తుడైన చందన్‌సింగ్ అనే కళాసీని పురమాయించి, లోపలున్న పెట్టెను హడావిడిగా బయటికి తెచ్చాడు.

ఆరుగురూ కలిసి పెట్టెను మోసుకెళ్ళి బాద్‌షాను ఆనుకొని ఉన్న చిన్న డింగీలోకి ఎక్కించేసరికి, చాలా మంది దొంగలు బాద్‌షా మీదికి ఎగబ్రాకటంమొదలైపోయింది. అర్జున్ సింగ్ మినహా అంతవరకూ పెట్టెను మోసిన సైనికులు ముగ్గురూ దొంగల తుపాకీ గుళ్ళకు ఆహుతయ్యారు.



మిగిలిన ముగ్గురూ గబగబా డింగీలోకి ఎక్కి దాన్ని బలంగా సముద్రంలోకి తోసారు. బాద్‌షాపైన యుద్ధం భయంకరంగా కొనసాగుతూనే ఉంది. ఆలోగా ముగ్గురూ తెడ్లు వేసుకుంటూ డింగీని బాద్‌షాకు దూరంగా తీసుకెళ్ళారు.

అంతలో వెనకనుండి చాలా కాగడాలు, తుపాకీ గుళ్ళు వారివైపుకు దూసుకు వచ్చినై.

ఫిరంగి గుళ్ళు అల్లంతదూరంలో సముద్రంలో పడి నిలువెత్తు కెరటాలను లేపినై. వాటిని తప్పించుకుంటూ ముగ్గురూ ప్రాణాలను అరచేత పట్టుకొని తెడ్లు వేశారు.



వాళ్ళ వెనకగా మరికొన్ని డింగీలు బయలు దేరాయి. ఒక్కో డింగీలోను ఐదారుగురు సముద్రపు దొంగలు! అయితే అప్పుడు రేగిన తుఫానులో ఎవరికి వారు వేరైనారు! తాము ఇప్పుడు, ఇక్కడ, ఇలాగ, ఒంటరిగా పడవలో చిక్కుకొని ఉన్నారు!

***

దూరంగా ఒక పొగబోటు శబ్దం విని కెప్టెన్ డిక్సన్ తన ఆలోచనల నుంచి బయట పడ్డాడు. వెంటనే తన సహచరులను మేల్కొల్పి విషయం చెప్పాడు. అందరూ ఆయుధాలను సర్దుకొని దాడిని ఎదుర్కొనేందుకు సిద్ధం అయ్యారు.

అయితే ఆ వచ్చింది బ్రిటిష్ నౌకాదళం వారి మరపడవ! అది తమ కోసమే వెతుకుతున్నదని తెలిసి పడవలోని ముగ్గురూ సంతోషంగా ఊపిరి పీల్చుకున్నారు. రెండు రోజులుగా నీళ్ళు-ఆహారం లేకుండా సముద్రంలో అల్లాడుతున్న వారికి ఇప్పుడు విముక్తి కలిగింది! ఇక సంపదంతా సునాయాసంగా బ్రిటన్ చేరుకోగలదు!

---

జోకు

**ఏమి ప్రేమ!**

టీచర్: మాతృభాషకీ పరాయిభాషకీ గలతేడా ఏమిటో చెప్పండి?!

కార్తిక్: మాతృభాష కళ్ళవంటిది, పరాయిభాష మీరు పెట్టుకున్న కళ్ళజోడు వంటిది.




1

ఇందు బిందు మంచి స్నేహితురాళ్ళు. చదివేది మూడో తరగతే గానీ, తెలివి తేటలు మాత్రం పెద్దవాళ్ళంత ఉన్నై. కష్టాల్లో ఉన్నవాళ్లకి సాయం చేయటంలో వాళ్ళెప్పుడూ ముందు నిలుస్తారు. అయితే అజాగ్రత్త కొద్దీ, 'ఎవరో ఏదో ఇచ్చారు కదా' అని తీసుకొని తింటే ఏమౌతుందో స్వయంగా అనుభవించి తెలుసుకోవాల్సి వచ్చింది వాళ్ళకు! ఒకరోజు ఏమైందో చూడండి--...

2

ఒక గ్రుడ్డి అతను పాపం, అటూ ఇటూ చూసుకోకుండా రోడ్డు దాటుతున్నాడు..




3

అక్కడున్న ఒక తాత వీళ్ళను భలే మెచ్చుకున్నాడు. వాళ్ళింటికి రమ్మని పిలుచుకెళ్ళాడు కూడా!




4

తాత వాళ్లని బాగా ఉబ్బించి, స్వీట్లు ఇచ్చాడు. అవి తినగానే వాళ్ళకు విపరీతమైన కడుపునొప్పి పుట్టింది. కళ్ళు తిరిగిపోయాయి..




5

ఇద్దరూ ఎంతసేపు అలా పడి ఉన్నారో తెలీదు- మెలకువ వచ్చేసరికి మాత్రం ఇద్దరి కాళ్ళూ-చేతులూ కట్టిపడేసి ఉన్నై..!




6

ఇందు బిందులు దగ్గరగా దొర్లారు! ఒకరి చేతులొకరు విడిపించుకున్నారు! ఆపైన కాళ్ళూనూ!!







8




ఇందు బిందు ఏమాత్రం భయ పడలేదు!

9

ఒకరిమీద ఒకరు ఎక్కి నిలబడేసరికి మామూలుగా
అందని వెంటిలేటరుకూడా అందింది..
ఇందు దాంట్లోంచి దూకి బయటపడింది..! మరి
బిందు సంగతెలాగబ్బా..? కిడ్నాపర్లు
వచ్చేస్తుంటారేమో, త్వరగా ఏదైనా చెయ్యాలి!



10

ఇందు నేరుగా పోలీసుస్టేషనుకు పరుగుపెట్టింది..




దొంగలిద్దరూ తలుపు తీసేసరికి గదిలో పోలీసులు!




11

"మీరు భలేపని చేశారమ్మా! పెద్ద దొంగల్ని పట్టించారు!
మీ అంత ధైర్యం ఉన్న పిల్లల్ని నేను ఇంత వరకూ
చూళ్ళేదు! బెస్టాఫ్ లక్!! అయితే ఇకమీద ఎప్పుడూ
పరిచయం లేనివాళ్ళు ఇచ్చేవి ఏవీ తినకండి, సరేనా?"




12

"మీకు సాహస బాలల అవార్డు ఇమ్మని సిఫార్సు
చేస్తాను..మీ చదువులకయ్యే ఖర్చంతా ఇకమీద
ప్రభుత్వమే భరిస్తుంది! బాగా చదువుకొని,
పదిమందికి సాయపడండి!" అన్నారు ఇన్స్పెక్టరు.






# మంచితనం

*రచన: జె. రాజేశ్వరి, 7 వతరగతి, మారీగోల్డ్, అరవిందహైస్కూల్, కుంచనపల్లి.*

వేటపాలెం సముద్ర తీరంలో ఉన్న ఒక గ్రామం. ఆ గ్రామంలో రాము, శ్యాము, గోపి అనే ముగ్గురు యువకులు ఉండేవారు. వాళ్ళు చిన్ననాటి నుండీ మంచి స్నేహితులు. ఎదుటి వారికి ఆపద వస్తే చూస్తూ ఊరుకోరు. తప్పక సహాయం అందిస్తారు. వాళ్ళు ముగ్గురూ కలిసి ఎన్నో సాహసాలు చేశారు కూడాను.

చెప్పటం మర్చిపోయాను, వాళ్లకు టోపీలు అంటే కూడా చాలా ఇష్టం . అవి పెట్టుకొని వాళ్ళు ఒకసారి పడవలో సముద్రానికి వెళ్ళారు, చేపలు పట్టడానికి. అయితే అప్పటికే ఆకాశంలో మేఘాలు కమ్ముకోసాగాయి. వాళ్ళు 'ఒడ్డుకు వెళదాము' అనే లోగానే పెద్ద తుఫాను మొదలైంది. సముద్రంలో పెద్ద పెద్ద అలలు రాసాగాయి! ముగ్గురూ బలంగా తెడ్లు వేస్తూ

తీరం చేరుకునేందుకు ప్రయత్నిస్తున్నారు. గాలి వాళ్ళ పడవని అటూ ఇటూ నెట్టివేస్తున్నది.



అంతలో వాళ్లకు ఒక పెద్ద పడవ కనబడింది. అది సముద్రంలో ఇంకా లోపలికి ఉంది. తుఫాను తాకిడికి దాని తెరచాపలు ఎక్కడో దెబ్బతిన్నట్లున్నాయి. అక్కడే మునిగి పోయేందుకు సిద్ధంగా ఉంది. అందులో ఉన్న దాదాపు 15 మంది ప్రయాణీకులు భయంతో అరుస్తున్నారు- "కాపాడండి, కాపాడండి" అని!

వాళ్ళ అరుపులు విన్నాక రాము, శ్యాము , గోపి ఇక ఏమీ ఆలోచించలేదు. తమ పడవని వెనక్కి తిప్పి, అతి కష్టం మీద ఆ పడవను చేరుకున్నారు. తమ దగ్గరున్న మూడు తెడ్లకూ ఆ పడవ అడుగున పడేసి ఉన్న ఇరవై తెడ్లను జోడించారు. ఏడుస్తున్న ప్రయాణీకులందరికీ వాళ్ల వాళ్ల శక్తిని బట్టి ఒకటో రెండో తెడ్లు ఇచ్చారు- అందరూ కలిసేటప్పటికి పడవ కొంచెంగా కదిలింది!

ఒకసారి పడవ కదిలేసరికి అందరికీ ధైర్యం వచ్చింది- ఏడుపులు ఆగిపోయాయి. అందరూ విశ్వాసంతో తెడ్లు వేసారు. భయంకరంగా వీస్తున్న గాలులు కూడా వాళ్ళ సమైక్య శక్తి ముందు తలవాల్చి దారి వదిలాయి. పడవ క్షేమంగా ఒడ్డు చేరుకున్నది.

ఆరోజున వాళ్ళు ముగ్గురూ కేవలం అంతమంది ప్రాణాలను కాపాడటమే కాదు; 'కలిసి పని చేస్తే ఎంతటి కష్టాన్నైనా దాటగలం' అని నిరూపించారు. వాళ్ళ శక్తి సామర్థ్యాలను, మంచితనాన్ని గుర్తించిన ప్రభుత్వంవారు అటుపైన వాళ్ళని తమ నౌకా విభాగంలో చేర్చుకుని సత్కరించారు! 

మంచిమాట

శరీరానికి వ్యాయామం ఎలాగో మెదడుకి పుస్తకపఠనం అలాగే.




# విషాద యాత్ర

*జయదీప్ రాసిన ఈ కథ, ఆంగ్ల సాహిత్యపు ఒరవడిని ఒకదాన్ని అచ్చంగా పుణికి పుచ్చుకున్నది. ఎవరో ఒకరిద్దరు పెద్దవాళ్ళు తప్పిస్తే, తెలుగులో ఇలాంటి కథల్ని అసలు ఎవ్వరూ రాసినట్లే లేరు!*

*కథ, కథనం: జయదీప్, 10 వ తరగతి, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.*

నేలమీద నా శరీరం నిస్సహాయంగా పడి ఉంది. ఇసుక యొక్క ఆ వెచ్చని స్పర్శ నా నిస్సహాయతను మర్చిపోయేలా చేస్తున్నది. లావుపాటి తాళ్ళతోబంధించబడిన నా శరీరం స్వాతంత్ర్యం కోసం ఉవ్విళ్ళూరుతున్నది. సగం తెరవబడిన నా కళ్ళు చుట్టూ ఉన్న ఇసుకను, ఎదురుగుండా ఉన్న సముద్రాన్ని నిస్సారంగా చూస్తున్నాయి..

అప్పుడో వ్యక్తి వచ్చాడక్కడికి. నన్ను బంధించి ఉన్న త్రాళ్ళన్నిటినీ కోసివేసి, 'నా వెంట రా!' అని ఆదేశించాడు. నేను మారు మాట్లాడ కుండా అతని వెంట వెళ్ళి అతను ఎక్కిన ఓ పడవలోకి ఎక్కాను. అన్నం తిని

ఎన్నిరోజులైందో మరి, పడవలో ఒక మూలన చతికిల పడేంతవరకూ నాకు ఊపిరి ఆడినట్లే లేదు! ఆకాశపు వెలుతురును తట్టుకోలేనట్లు నా కళ్ళు వాటంతట అవే మూతలు పడ్డాయి.

మళ్ళీ తెలివి వచ్చేసరికి, నేనెక్కిన పడవ కదులుతున్నట్లు నాకు తెలుస్తున్నది. పడవలో నాతో కలిపి మొత్తం ముగ్గురం ఉన్నాం. వాళ్లలో ఒక మధ్య వయస్కుడు నాకు ఒక కవర్ అందించాడు- అందులో కొంచెం ఆహారం ఉంది!

వాళ్ళిద్దరూ నావైపు ఆసక్తి లేని మొహాలతో చూశారు. నేను వాళ్లిచ్చిన అన్నం తినేందుకు ఒకసారి తటపటాయించాను; కానీ చివరికి ఆకలే గెలిచింది. నా దృష్టిని వాళ్ల మొహాలమీది నుంచి మరలించి, తినే అన్నంపైన పెట్టటం మొదలెట్టాను..

మళ్ళీ నిద్రలేచాక అడిగాడు వాళ్లలో ఒకడు- "కొంచెం శక్తి వచ్చినట్లుంది.. మాట్లాడ గలవా, ఇప్పుడు?" అని.

నాగురించి చెప్పటం మొదలెట్టాను.

"నేనొక సైనికుడిని. యుద్ధసమయంలో శత్రువులు నన్ను బందీని చేశారు. ప్రయాణిస్తూ ఆ దీవిలో ఆగారు వాళ్ళు. వాళ్ల దగ్గరున్న ఆహారం అయిపోవచ్చింది. నా వల్ల వాళ్లకు ఒరిగేదేమీ లేదని తెలియవచ్చింది-ఇక నామీద ఆహారాన్ని, నీళ్లను వెచ్చించటం వృధా. దయగలవాళ్ళు కనుక, నన్ను సముద్రంలో విసిరెయ్యకుండా ఆ దీవిలో వదిలి పెట్టి వెళ్ళిపోయారు" అని వివరించా.



"మా ఊరు ఇక్కడికి 50 మైళ్ళ దూరంలో ఉంది. ముందు నిన్ను అక్కడికి తీసుకెళ్తాం. ఆ తర్వాత నిన్ను మీ ఊరికి ఎలా చేర్చాలో ఆలోచిస్తాం" అన్నారు వాళ్ళు.

శత్రువుల దెబ్బలతో ఒళ్ళు హూనమైన నాకు, ఆ సుదీర్ఘ ప్రయాణంలో ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు. మళ్ళీ ప్రొద్దున కళ్ళు తెరిచేటప్పటికి మా చుట్టూ అనంతమైన సముద్రం. వాళ్ల

మొహాలు చూడగా నాకు అర్థమైన విషయం ఏంటంటే- రాత్రి వచ్చిన తుఫానులో మేం దారి తప్పాం!

అయితే వాళ్ళిద్దరూ అనుభవం ఉన్న నావికులు. తప్పిపోయామన్న బాధ అణుమాత్రం కూడా కనబడలేదు వాళ్లలో. ఎటువైపు పోవాలో లెక్కలు వేసుకొని, అటువైపుకు వేగంగా పడవను నడపటం మొదలెట్టారు ఇద్దరూ. సగం రోజు గడిచింది.. చుట్టూ నీలిరంగు సముద్రం తప్ప మరేమీ కనబడటం లేదు.



వాళ్ళిద్దరూ వంతుల వారీగా పడవను నడిపే బాధ్యత తీసుకుంటున్నారు. ఊరికే కూర్చుంటున్నందుకు నాకు సిగ్గుగా ఉంది- కానీ ఏం చేసేది, శరీరంలో ఏమాత్రం శక్తి లేదు.

మెల్లగా ఒకరోజు గడిచింది. పడవలో త్రాగే నీళ్ళు ఎక్కువ ఉన్నట్లు లేవు. సముద్రంలో నీళ్ళు ఉప్పగా ఉంటై- త్రాగేందుకు పనికి రావు.

నేను మెల్లగా శక్తిని కూడగట్టుకొని కూర్చున్నాను. "నీళ్ళు కావాలంటే త్రాగు. ఆహారం కూడా నీకే. కొంచెం పొదుపుగా ఉండు. నేల ఎప్పటికి తగుల్తుందో చెప్పలేం" అన్నాడు వాళ్ళలో ఒకడు.

నేను వాళ్లకేసి అదోలా చూశాను. కొన్ని నీళ్ళు త్రాగి, కొంచెం అన్నం తిన్నాను. మెల్లగా వాళ్లిద్దరితోబాటు నేనూ ఒకవంతు పడవ నడిపించటం మొదలు పెట్టాను. ఇప్పుడు ముగ్గురం పడవ నడుపుతున్నాం. చాలా శ్రమతో కూడిన పని అది. ఇలా మూడు రోజులు గడిచాయి. పడవలో నీళ్ళు, ఆహారం దాదాపు అయిపోయాయి. వాళ్ళిద్దరూ నీళ్ళు త్రాగటం మానేశారు: అన్నం అయితే రెండురోజులుగా అసలు తిననేలేదు.

ఇప్పుడు ఒక గంట పడవ నడిపితే ఒక గంట ఏమీ చెయ్యకుండా విశ్రాంతిగా కూర్చుంటున్నాం; ముగ్గురం చాలా

నీరసించిపోయాం. అందరి ముఖాలలోనూ అసహనం స్పష్టంగా కనబడుతూంది. రానురాను పడవ నడిపే శక్తి మాలో పూర్తిగా హరించుకుపోయింది. ముగ్గురం ఏమీ పట్టనట్టు కూర్చున్నాం పడవలో.

రాత్రి అయ్యింది మళ్ళీ. వాతావరణం చల్లగా మారింది. మాకు అన్ని వాతావరణాలూ ఒకటే అన్నట్లున్నాయి. చుట్టూ సముద్రం నిశ్చలంగా ఉంది. పైన నక్షత్రాలు మెరుస్తున్నై. వాటిని చూస్తుంటే నాలో విచిత్రమైన అలజడి.. "వీళ్లిద్దరికీ నేను బరువౌతున్నానా? నీళ్లని, ఆహారాన్ని పొదుపు చేసుకోవటంకోసం ఈ రాత్రికి వీళ్ళు నన్ను సముద్రంలోకి విసిరేస్తారేమో...?"

ఆలోచనలతోటే తెల్లవారింది.

వాళ్లలో ఒకడు కదిలాడు- తన జేబులో ఉన్న స్టీలు వాచీని తీసి చూసుకున్నాడు. దాన్ని తన ముంజేతికి కట్టుకున్నాడు. దాన్నే తడుముకుంటూ మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. ఎవరో గుర్తుగా ఇచ్చిన వాచీ అయి ఉంటుందది. ఎవరిచ్చారో మరి..

ముగ్గురం స్పృహ తప్పినట్లు పడిపోయాం..మధ్యాహం తర్వాత ఏదో పెద్ద శబ్దం వినవచ్చి కళ్ళు తెరిచి చూశాను. సందేహం లేదు. హెలికాప్టర్ శబ్దం! మమ్మల్ని కాపాడేందుకు వచ్చినట్లుందది! నేను సంతోషంతో అరవాలని ప్రయత్నించాను. గొంతులోంచి అరుపు రాలేదు. నా ఆనందాన్ని పంచుకునేందుకని వాళ్ళిద్దర్నీ లేపేందుకు ప్రయత్నించాను- కానీ వాళ్ళు లేవనే లేదు.



హెలికాప్టర్‌లోని వాళ్ళు నన్నూ, వాళ్ళిద్దరి శవాలనూ పైకి ఎక్కించారు. నాలో ఒక తెలియని ఉద్వేగం..సంతోషించాలో,

దు:ఖించాలో తెలియని స్థితి.

"వాళ్ళిద్దరూ ఎవ్వరో తెలీదు నాకు. కానీ నా కోసం తమ ప్రాణాల్ని అవలీలగా త్యాగం చేశారు..ఎందుకు? ఆకలికీ, దాహానికీ తట్టుకోలేక చనిపోయారు- అయినా పడవలో నాకోసం ఉంచిన నీళ్ళను మాత్రం ముట్టుకోలేదే, ఇద్దరూ..?"

హెలికాప్టర్‌లో ఉన్నవాళ్ళ మాటలు వినబడుతున్నాయి, లీలగా.."చనిపోయిన ఆ ఇద్దరిలో ఒకడి చేతికి స్టీలు వాచీ ఉంది చూశావా? సూర్యకిరణాలు ఆ వాచీ మీదపడి, ఆకాశంలోకి పరావర్తనం చెందాయి. హెలికాప్టర్‌లో ఉన్న మన దృష్టిని అవే, ఇటు మరల్చాయి. లేకపోతే ఇతను కూడా బ్రతికేవాడు కాదు.." అని.

పేరు తెలీని వాళ్ళే కాదు; వాళ్లకి దగ్గరి వాళ్ళు కూడా నాకు ప్రాణ భిక్షపెట్టారన్నమాట! అంత స్తబ్దతలోనూ నా కళ్ళు చెమర్చటం నాకు తెలిసింది. 




**లెక్కలకు సున్నా!**

లెక్కల అయ్యవారు: సున్న పక్కన సున్న పెడితే ఎంతవుతుందిరా?

తుంటరి రాము: సున్నం అవుతుంది సార్!

**వింత ప్రాణి!**

రాము కొత్త బట్టలు వేసుకొని జూ కి వెళ్ళి వచ్చాడు.

అమ్మ: ఏమిరా! నీ కొత్త బట్టలు ఎలా ఉన్నాయి?

రాము: భలే ఉన్నాయమ్మా! అందరూ జూలో చింపాంజీల్ని చూడటం మానేసి నన్నే చూశారు!

**వేదం!**

టీచరు: నారు పోసినవాడే నీరు పోస్తాడనుకోకండి!

అల్లరి రాము: అవును టీచర్, పాఠాలు చెప్పిన వాళ్ళే పరీక్షలు రాయరు కదా!




# కొక్కిరమ్మ గుడ్లు

*కొక్కిరమ్మ గుడ్ల కథని రకరకాల రూపాల్లో చెబుతుంటారు. ఏదో ఒక రూపం మీకూ తెలిసే ఉంటుంది. దీన్ని సరదాగా చదవండి- మీకు తెలిసినకథని గుర్తుచేసుకోండి.*



*రచన: ఆదూరి హైమావతి, విశ్రాంతప్రధానోపాధ్యాయిని, బెంగుళూరు.*

పిల్లలూ! నా చిన్నప్పుడు- అంటే నాకు ఆరేడు ఏళ్ళప్పుడన్న మాట (ఇప్పుడు నాకు 65!) మా అమ్మమ్మ సత్యాన్ని గురించి చెప్పిన ఈ కథ నాకింకా జ్ఞాపకం. సత్యం మానవులకే కాక, పశు-పక్ష్యాదులకు సైతం ఒక్కటేననీ, అసత్యం చెప్పిన వారికి దండనతప్పదనీ ఈ కథ వలన తెలుస్తుంది. అందుకే మీకు ఈ కథను 'కొత్తపల్లి 'ద్వారా చెప్పాలన్పించి, చెప్తున్నాను.

పూర్వం ఒక కొక్కిరమ్మ ముంతంత ఇల్లుకట్టుకొని, దాన్లో మూడు పుట్ల వడ్లు పోసుకుని, వడ్లమీద గుడ్లు పెట్టుకుని, గుడ్ల మీద తాను పడుకుంది. ఇంతలో ఒక ఏనుగు వచ్చి, "చలిగా ఉంది కొక్కిరమ్మా, నాక్కాస్త

చోటిస్తావా?" అని అడిగింది, దానికి కొక్కెరమ్మ "ఏనుగన్నా! నేను ముంతంత ఇల్లు కట్టుకుని మూడు పుట్ల వడ్లు పోసుకుని, వడ్ల మీద గుడ్లు పెట్టుకుని, గుడ్ల మీద పడుకున్నా, నా వెనక చోటుంటే నువ్వు పడుకో" అంది.

"సరే" అని కొంగ వెనుక ఏనుగు పడుకున్నది.

ఇంకాస్త సేపటికి ఒక నక్క వచ్చింది- "కొక్కెరమ్మ కొక్కెరమ్మా! నాక్కాస్త చోటిస్తవా?" అని అడిగిందట అది. "నక్క బావా! నేను ముంతంత ఇల్లు కట్టుకొని మూడు పుట్ల వడ్లు పోసుకొని వడ్లమీద గుడ్లు పెట్టుకొని, గుడ్లమీద పడుకున్నా, నా వెనక చోటుంటే ఏనుగు పడుకుంది, ఏనుగు వెనక చోటుంటే నువ్వు పడుకో" అంది.

నక్క వచ్చి ఏనుగు వెనుక పడుకుంది.

మరికొంత సేపటికి ఒక పిల్లి వచ్చింది- "కొక్కెరమ్మ కొక్కెరమ్మ ! నాక్కాస్త చోటిస్తవా?" అంది. కొక్కెరమ్మ చెప్పింది- "పిల్లిమావా! నేను ముంతంత ఇల్లుకట్టుకుని, మూడు పుట్ల వడ్లు పోసుకుని, వడ్ల మీద గుడ్లు పెట్టుకుని, గుడ్ల మీద పడుకున్నా, నా వెనక చోటుంటే ఏనుగు పడుకుంది, ఎనుగు వెనక చోటుంటే నక్క పడుకుంది, నక్కెనక చోటుంటే నువ్వు పడుకో!" అంది. పిల్లి కూడా పడుకుంది.

మరికొంత సేపటికి ఒక గుర్రం , ఒక తోడేలు వచ్చాయి. రెండూ కొక్కెరమ్మను అలాగే అడిగాయి. కొక్కెరమ్మ వాటికీ అలాగే చెప్పింది. రెండూ వచ్చి పడుకున్నాయ్.

మధ్య రాత్రి అయ్యే సరికి కొక్కెరమ్మకు పట పట మనే శబ్దం వినిపించింది.

"ఏంటా శబ్దం? ఎవరైనా నా గుడ్లుకానీ తింటున్నారా?" అడిగింది కొక్కెరమ్మ నిద్రలోనే.

"లేదు కొక్కెరమ్మా! చలికి నా పళ్ళు పట పటమని కదులుతున్నాయి" అందట పిల్లి.

తెల్లారినాక చూసుకుంటే కొక్కెరమ్మ గుడ్లు లేనే లేవు!

కొక్కెరమ్మ విచారంతో "మీ అందరికీ నేను రాత్రి చోటిచ్చాను. అయినా మీలో ఎవరో

నాగుడ్లు తినేశారు. ఎవరో చెప్పి తప్పు ఒప్పుకోండి మర్యాదగా" అంది.

"మేమెందుకు తింటాం కొక్కెరమ్మా! నువ్వెంత మంచిదానివో మాకు తెలీదా?" అన్నాయి అన్నీ.

"మీరంతా గుండ్లకమ్మ నదికి వచ్చి ఒక్కోరూ ఆ నదిలో మునిగి ప్రమాణం చేయండి. ఎవరైతే గుడ్లు తిన్నారో వారిని గుండ్లకమ్మే ముంచుతుంది"అందిట కొక్కెరమ్మ ఏడుస్తూ.

అన్నీ సరేనని నదిలో నిల్చుకొని కొక్కెరమ్మ చెప్పినట్లు పలికాయి: "కొక్కెరమ్మ గుడ్లంట, నేనంట తిన్ననంట, తిన్ననంటె ముంచు ముంచు గుండ్లకమ్మ-లేకుంటే తేలగొట్టు గుండ్లకమ్మ " అని మూడుమార్లు ప్రమాణం చేసి అన్నీ ఆ నది నీళ్లలో మునిగాయి.

అన్నీ నీళ్ళలోంచి బయటకి వచ్చాయి- కానీ పిల్లిమాత్రం రాలేదు: గుండ్లకమ్మలో కొట్టుకు పోయింది.

అప్పుడు మిగిలినవన్నీ "చూడు, కొక్కెరమ్మా! నువ్వేమో నీ ముంతంత ఇంట్లో చలి రాత్రిలో పడుకోను చోటిచ్చావు మాకు. కృతజ్ఞతలేని ఆ దొంగ పిల్లి నీ గుడ్లన్నీ తినేసింది. కానీ గుండ్లకమ్మ నది అసత్యానికి అన్యాయానికి తగిన శిక్షే విధించిందిలే, బాధపడకు "అని ఓదార్చాయి.

చూశారా పిల్లలూ! అన్యాయానికి, కృతఘ్నతకూ శిక్ష తప్పదు మరి! ఎప్పుడూ నీతి నిజాయితీలతో నడచుకుంటూ ఇతరులకు చేతనైన సాయం చేస్తుంటారు గదూ!



---

**పంచ ప్రాణాలు!**

జోకు

యముడు: పిసినారి పాపయ్య ప్రాణాలు తెమ్మంటే ఈ పెట్టెని తెచ్చారేంటిరా?

కింకరులు: అతని ప్రాణాలు ఈ పెట్టెలోనే ఉంటాయని అందరూ అనుకుంటుంటేను....!



# ఆవకాయ మంత్రం

*రచన: శ్రీమతి రాధ మండువ, ఉపాధ్యాయిని, రిషివ్యాలీ, మదనపల్లి.*

భవానీపురంలో పెద్ద చెరువు ఒకటి ఉండేది. దాని గట్టు ప్రక్కనే ఒక పాత పెంకుటిల్లు ఉండేది. ఆ పెంకుటింట్లో శివయ్య, పార్వతమ్మ అనే దంపతులు ఉండేవాళ్ళు. వాళ్ళకు ఇద్దరు పిల్లలు: రవి, శైలజ. పార్వతమ్మ రకరకాల ఊరగాయ పచ్చళ్ళు తయారు చేసేది. శివయ్య తమకున్న రెండు ఆవులనూ మేపుకుని ఇంటికి వచ్చాక, భార్య తయారు చేసిన పచ్చళ్ళను పట్నానికి తీసుకుపోయి, అక్కడ అంగళ్ళ వాళ్ళకి అమ్మేవాడు. ఇలా ఆ భార్యాభర్తలిద్దరూ కలసికట్టుగా సంసారాన్ని లాక్కొస్తున్నారు.

ఆ సంవత్సరం రవి పదో తరగతికి వచ్చాడు. పచ్చళ్ళకోసమని పార్వతమ్మ ఇంట్లో ఎప్పుడూ దంచుతూ ఉండేది గదా, ఆ దంపుళ్ళ వల్ల ఇల్లంతా ఎప్పుడూ ఏవో ఘాటు వాసనలు

ఉండేవి. ఆ వాసనల మధ్య చదువుకునేదెలాగ? అందుకని రవి తను ప్రశాంతంగా కూర్చొని చదువుకునేందుకు తగినస్థలం ఒకటి వెతుక్కున్నాడు.

చెరువు గట్టునే, ఊరికి కొంచెం దూరంగా, పాత మిద్దె ఒకటి ఉండేది. అది ఒక సైనికుడి ఇల్లు. ఎప్పుడో జరిగిన యుద్ధంలో పాపం, ఆ సైనికుడు చనిపోయాడు. ఆ వార్త వినగానే అతని భార్యకాస్తాగుండె ఆగి మరణించింది.



దీనికంతటికీ కారణం ఆ ఇల్లే అని ఊళ్ళో వాళ్ళు చెప్పుకునేవాళ్ళు. చీకటి పడిందంటే ఆ మిద్దె ఛాయలకు కూడా ఎవ్వరూ వెళ్ళరు.

కానీ రవికి ఏం భయం? తను ఆ భవంతి వసారాని శుభ్రం చేసుకున్నాడు. పగలంతా అక్కడే వరండాలో కూర్చుని చదువుకునేవాడు. చీకటి పడకముందే మెల్లగా ఇల్లు చేరుకునేవాడు.

ఇలా ఉండగా ఒకసారి బంగాళాఖాతంలో వాయుగుండం ఏర్పడింది. జోరున వర్షం కురవసాగింది. సాయంత్రం ఆరు గంటలకే చీకట్లు ముసురుకున్నాయి. పిల్లలందరూ భోజనాలు చేసేసి పడుకున్నారు. అనుకున్నట్లుగానే "చెరువు పొంగేట్లుంది! అందరూ ప్రెసిడెంట్ గారి చావిడికి వెళ్ళాలని హెచ్చరిక చేస్తున్నారహో!" అని దండోరా వేయించారు పంచాయితీ వాళ్ళు. దాంతో గ్రామం లోతట్టు ప్రాంతంలో ఉన్న వాళ్ళందరూ గోలగోలగా అరుచుకుంటూ తట్టా, బుట్టా సర్దుకుని చావిడి వైపు పరిగెత్తటం మొదలుపెట్టారు.

శివయ్య కుటుంబం కూడా విలువైన వస్తువులను మూట కట్టుకుని చావిడిలోకి చేరింది. అందరూ గజగజలాడుతూ రాత్రిని

అక్కడే గడిపారు. మర్నాడు మధ్యాహ్నానికిగానీ వాన తెరిపినివ్వలేదు. 'ఊళ్ళో నీరు తీయడానికి మరో రెండు రోజులు పట్టొచ్చు ' అనుకుంటూ అందరూ ఇంటికి బయలుదేరారు. తీరా చూస్తే అక్కడ శివయ్యవాళ్ళ ఇల్లు వరద నీటికి నాని, పూర్తిగా కుప్పకూలిపోయి ఉన్నది!

శివయ్య, పార్వతమ్మ అక్కడే కూర్చుని ఏడవటం మొదలు పెట్టారు. శైలజ బిత్తరచూపులు చూస్తూ నిలబడింది. ముందుగా తేరుకున్న రవి జరగవలసిన దాన్ని గురించి ఆలోచించాడు. ముగ్గురికీ ధైర్యం చెప్పాడు. కుటుంబం మొత్తాన్నీ సైనికుడి మిద్దెకి తీసుకువెళ్ళాడు. తుఫాను వచ్చి వెలిసినా, వసారా ఇంకా శుభ్రంగానే ఉన్నది. తల్లిదండ్రులను వరండాలో కూర్చోబెట్టి రవి, శైలజలు ఆ ఇంటి తాళం పగలగొట్టి లోపలికి వెళ్ళారు. శైలజకు కొంచెం భయంగా ఉన్నా, అన్న చెప్పినట్లు విన్నది. ఇద్దరూ గబగబా ఇంటిని శుభ్రం చేశారు. నసుగుతూ, భయపడుతూ, వద్దువద్దంటూ, చేసేదేమీలేక లోపలకు వచ్చింది పార్వతమ్మ. కూలిపోయిన ఇంటికి వెళ్ళి, కొన్ని పాత్రలు, సామాన్లు తెచ్చాడు రవి. శైలజ వంట చేసింది. అందరూ ఏదో తిన్నామనిపించి, త్వరగానే పడుకున్నారు.

అయితే ఆ రాత్రి పార్వతమ్మకి చాలా భయం వేసింది.. చాలాసేపు అసలు నిద్రే పట్టలేదు.. ఇంకా కొంచెం సేపట్లో తెల్లవారుతుందనగా ఆమెకి ఇంటిలోపలినుండి ఏదో గజ్జెల శబ్దం వినబడింది.. రాను రాను ఆ శబ్దం మరింత పెద్దగా అవుతున్నది!! ఆమె గబుక్కున లేచి కూర్చొని వగరుస్తూ "అయ్యో! ఊపిరి ఆడటం లేదు !" అని అరవటం మొదలు పెట్టింది. ఇంటిల్లిపాదీ అదిరిపడి లేచి కూర్చున్నారు. శైలజేమో, భయంతో నాన్న ప్రక్కకి చేరింది. "అదిగో, గజ్జెల శబ్దం! దయ్యం-దయ్యం " అని అరుస్తోంది పార్వతమ్మ. రవి, శివయ్య, శైలజ శ్రద్ధగా విని చూశారు. వాళ్లకు మాత్రం ఏ గజ్జెల శబ్దమూ వినపడలేదు!

అందరూ పార్వతమ్మ ప్రక్కనే చేరారు. ఆమెకి

ధైర్యం చెప్పి ఓదార్చసాగారు. వాళ్ళు వేరే ఇంటికి మారే అవకాశం ఇప్పట్లో లేదు. ఎంత కష్టమైనా సరే, అక్కడే సర్దుకోవాలి. పార్వతమ్మకూ ఈ విషయం తెలుసు. అయినా 'దయ్యం' అన్న భయం ఆమె మనసులో తిష్ఠ వేసుకొని ఉన్నది. ఏ ప్రమేయం లేకుండానే ఆమె ఆనాటినుండి ప్రతిరోజూ రాత్రిపూట ఇలాగే అరవటం మొదలు పెట్టింది. అంతేగాక రోజురోజుకీ చిక్కిపోసాగింది!



సైన్సు పాఠాలు శ్రద్ధగా చదివే రవికి తెలుసు- "'గుహల్లోను, పాత మిద్దెల్లోను గాలి కదలిక పెద్దగా ఉండని చోట్ల, గాలిలో ఉండే కార్బన్ డై ఆక్సైడు మొత్తం నేలకు దగ్గరగా పరచుకొని ఉంటుంది. అలాంటి చోట్ల, నేలమీద పడుకుంటే, మనకు కావలసినంత ఆక్సిజన్ అందదు- కొంచెం అసౌకర్యంగా, ఊపిరి ఆడనట్లుగా ఉంటుంది. దానికి భయపడనవసరం లేదు!' అయినా, అమ్మ భ్రాంతికి లోనయ్యింది! 'దయ్యం'అని ఆమెకున్న మూఢనమ్మకానికి మందు ఏది?

ఆలోచించిన మీదట, 'ఈ పిచ్చి నమ్మకాన్ని మరో నమ్మకంతోటే పోగొట్టాలి తప్ప, వేరే మార్గం లేదు' అనిపించింది రవికి. తనకు తట్టిన ఉపాయాన్నొకదాన్ని అతను శైలజకు, శివయ్యకు వివరించాడు. వాళ్ళూ అందుకు ఒప్పుకున్నారు- ఎందుకు ఒప్పుకోరు? "దయ్యం లేదు, గియ్యం లేదు - అది బంగారం లాంటి ఇల్లు" అని వాళ్ళకు తెలిసింది మరి!

ఆ రాత్రి భోజనాలయ్యాక రవి పార్వతమ్మ వద్దకు చేరి "అమ్మా! దయ్యాలకు ఎర్రటి ఆవకాయ కారం ఎరుపు అంటే భయం కదా?"

అని అడిగాడు.

"ఔనురా!" అంది పార్వతమ్మ గుసగుసగా. "ఏమో, ఎవరికేం తెలుసు?" అని మనసులోనే అనుకుంటూ.

"మన ఇంట్లో ఉన్న దయ్యాన్ని వెళ్ళగొడదామమ్మా, ఇవాళ్ల రాత్రి! నువ్వు చేసి పెట్టావుగా, ఆవకాయ పచ్చడి?! అందులో ఇంకొంచెం కారం కలిపి పెట్టు. మరింత ఎర్రగా చెయ్యి. సమయం చూసుకొని నాన్న వెనకనించి దయ్యం జుట్టు పట్టుకుంటాడు. నేనేమో దాని ఒళ్ళంతా ఆవకాయ కారం పట్టిస్తాను. దాంతో అది ఇక వెనక్కి తిరిగి చూడకుండా పారిపోతుంది; బంగారం లాంటి ఈ ఇల్లు మన సొంతమవుతుంది- ఏమంటావు?" అన్నాడు రవి.

ప్రాణం లేచివచ్చినట్లయింది పార్వతమ్మకి. "సరే! అంతకన్నానా! ఇప్పుడే కలుపుతా, కారం!" అంటూ మంచం మీద నుండి ఉత్సాహంగా లేచింది ఆమె. ఆవకాయ జాడీలో మరింత కారం, నూనె కలిపి పెట్టింది.

ఆరోజు అర్థరాత్రి దాటగానే ఆమె యధాప్రకారం "దయ్యం -దయ్యం" అని అరవడం మొదలుపెట్టింది.

"నువ్వు పడుకొనే ఉండమ్మా! -నాన్నా! త్వరగా రా! అదిగో, ఆ దయ్యం జుట్టు పట్టుకో! -చెల్లీ! ఆవకాయ జాడీ పట్టుకురా! ఇదిగో నేను చెబుతా నీపని! హహ్హహ్హా!" అని హడావుడి చేస్తూ, అరుస్తూ గందరగోళం సృష్టించాడు రవి.

శైలజేమో పథకం ప్రకారం గొంతు మార్చి " అమ్మో! ఎరుపు, అమ్మో! మంట ! కారం - కారం! -నన్ను వదలండి, నేను మీ జోలికి రాను. హా! హా!" అని పెద్దపెట్టున అరిచింది.

"ఫో! ఫో ! మళ్ళీ ఈ చుట్టు ప్రక్కల కనిపించావంటే వదిలేది లేదు!" అంటూ రవి, శివయ్యలు కేకలు వేశారు. కాసేపటికి గొడవ సద్దుమణగ్గానే పార్వతమ్మ భయం భయంగా కళ్ళు తెరిచింది. ఇల్లంతా ఆవకాయ కారం గుమ్మరించి ఉంది. శైలజ, రవి, శివయ్య, అందరూ ఆవకాయ కారం కొట్టుకొనిపోయి ఉన్నారు. "చూశావా, అమ్మా! నీ ఆవకాయ దెబ్బకి దయ్యం ఎట్లా వదిలి పారిపోయిందో!

చెరువులోకి దూకినా మన కారం మంట మాత్రం వదలదు దాన్ని!" అన్నాడు రవి ఇకిలిస్తూ. సంతోషంతో అందరి ముఖాలూ వెలిగిపోతుంటే చూసి తనూ నవ్వేసింది పార్వతమ్మ.

అటుపైన ఆమె లేచి, ఎంతో హుషారుగా ఇల్లంతా శుభ్రం చేసింది. దయ్యం వదిలిన సంతోషం ఆమెలో స్పష్టంగా కనబడింది. ఇక ఏనాడూ ఆమెకు గజ్జెల శబ్దం వినబడనే లేదు! తమ మంత్రం ఫలించిందని రవి, శివయ్య, శైలజ ఒకరినొకరు చూసుకుంటూ నవ్వుకున్నారు.

ఆ ఊర్లో ఉండే పాతతరం వాళ్ళు మటుకు ఇప్పటికీ ఆశ్చర్యపోతుంటారు- "ఆ దయ్యాల కొంపలో వీళ్ళెట్లా ఉంటున్నారు?" అని. వాళ్లకి మరి ఆవకాయ మంత్రం తెలీదుగా?!



---

**నెలలు నిండాయి!**

టీచరు: 'సంవత్సరం అయిపోయింది' - దీన్ని మరో విధంగా చెప్పు, రామూ!

రాము: “నెలలు నిండాయి” సార్!

**తెలివి!**

టీచర్: ఒరేయ్ అశోకుడు రోడ్డుకు ఇరుప్రక్కలా చెట్లు ఎందుకు నాటించాడో చెప్పండిరా!

పిల్లలు: రోడ్డు మధ్యలో నాటిస్తే బళ్ళు, వాహనాలకు అడ్డం కద సార్, అందుకని!

**దేశభక్తి!**

టీచర్: రామూ! వచ్చి ఈ పటంలో మన దేశం ఎక్కడుందో చూపించు!

రాము: క్షమించండి టీచర్! నేను నా దేశాన్ని వేలెత్తి చూపించలేను!



# ఉగాది

*రచన: నారాయణ, కొత్తపల్లి బృందం.*

చిన్నారి అలేఖ్యకు ఇంకా రాయటం రాదు-గానీ చాలా కథలు చెప్పటం వొచ్చు.

ఒక రోజున ఆ పాప అడవిలో పోతుంటే, ఒక మేకపిల్ల ఎదురైంది.

"మేకా మేకా, ఇక్కడెందుకు తిరుగుతున్నావ్, ఒక్కతివే? పో, మీ అమ్మ దగ్గరికి!" అన్నది అలేఖ్య.

"మా అమ్మకోసమే వెతుక్కుంటున్నాను. ఎక్కడికిపోయిందో ఏమో; కనబడటమే లేదు" అన్నది మేకపిల్ల.

"సరే, అయితే నాతో రా" అని అలేఖ్య దాన్ని వెంటబెట్టుకొని నడుస్తా పోయింది. ఎంత వెతికినా

వాళ్లమ్మ కనబడలేదు!



అంతలో రోడ్డు మీదికి ఒక బస్సువచ్చింది. అలేఖ్యను చూసి ఆగిందది. దానిలో నిండా చాలామంది జనాలు, కోళ్లు, మేకలు , జీవాలు- అందరూ పోతున్నారు.

"రా, పాపా! బస్సెక్కు, ఎక్కడికి పోవాలి?" అడిగారు వాళ్లు.

"వీళ్ల అమ్మ దగ్గిరికి పోవాలి. ఎక్కడుందో, ఏమో?!" అన్నది అలేఖ్య. వాళ్లు అన్నారు-

"మేకలు ఉదయాన్నంతా ఎక్కడికి పోయినా రాత్రి అయ్యేసరికి ఊళ్లోకి వచ్చేస్తై గదా, అందుకని మీరూ వచ్చేసి ఊళ్లో ఉండండి. వీళ్ల అమ్మకూడా వస్తుంది లెండి" అని.



'సరే'; అని వీళ్లిద్దరూ బస్సెక్కి ఊళ్లోకి వెళ్లారు.

ఊళ్లోకి రాగానే మేకపిల్లకు వుషారు వచ్చేసింది. "ఇదే- ఇదే మాఊరు!" అరిచిందది. "మా ఇల్లు చూపిస్తాను రా!" అని వెంటబెట్టుకుపోయింది అలేఖ్యను.

చూస్తే ఆ పాప ఆశ్చర్యపడిపోయింది: ఆ ఇల్లు చిన్న ఇల్లుకాదు - రాజుగారి ఇల్లులాగా పే...ద్ధగా ఉంది! దాని మధ్యలో చాలా చాలా మేకలు,

గొర్రెలు , ఆవులు, అన్నీ చక్కగా తిరుగుతూ ఉన్నై!! ఒక పెద్దాయన వాటన్నిటికీ నీళ్లు పెడుతున్నాడు.

మేకపిల్ల మందలోకి పరుగెత్తుకు పోయింది. అన్నింటికీ అటూఇటూ నెట్టుకుంటూ పోయింది. దాని వెనకనే అలేఖ్య! చివరికి మేకపిల్ల వెతికీ వెతికీ వాళ్లమ్మను కనుక్కున్నది.

"ఎక్కడికి పోయావే, నువ్వు!" అని కళ్లలో నీళ్లు కార్చుకుంటూ అమ్మ సంబరపడింది.

"నువ్వెక్కడికి పోయావ్! నీకోసం నేను అడివి అంతా వెతికాను" అని కళ్లనీళ్లు పెట్టుకొని అరిచింది మేకపిల్ల.

కొంచెం సేపయ్యాక మేకమ్మ అలేఖ్యని చూసి, "అయ్యో నువ్వేకదూ , మాపాపని బస్సెక్కించి ఇక్కడికి తీసుకొచ్చింది?! ఎంత మంచి పాపవు! ఏ ఊరు మీది?" అని అడిగింది. చక్కగా పెద్దగ్లాసుతో చాలా పాలిచ్చింది తాగమని.

అలేఖ్య అక్కడే నిలబడి పాలు తాగుతుంటే ఆ ఇంటాయన వొచ్చాడక్కడికి.



అలేఖ్యని చూడగానే కళ్ళు నులుముకొని చూసి - "చిన్నీ! ఒసే, చిన్నీ!! ఇక్కడికి ఎట్లావచ్చావే, ఒక్కతివే? ఏరీ, అమ్మా నాన్నా ఏరి?! అని అరిచాడు.

అదెవరనుకుంటున్నారు? సుబ్బయ్య తాతే!

అలేఖ్య పాలగ్లాసు అక్కడ పెట్టేసి ఒక్కదూకులో సుబ్బయ్య తాత చంక ఎక్కేసింది. అప్పటి వరకూ ఉన్న ధైర్యం ఎటుపోయిందో ఏమో, ఒకటే ఏడుపు- "వావ్...."అని. ఏడుపు మధ్యలోనే

చెప్పింది: "అమ్మ తప్పిపోయింది- ఎటు - పోయిందో - తెలీదు" అని. దాని ఏడుపువిని బుజ్జి మేక ఏడ్చింది. వాళ్లమ్మ ఏడ్చింది. ఆవులు ఏడ్చాయి. జీవాలన్నీ ఏడ్చాయి. సుబ్బయ్య తాతయ్య మటుకు ఏడవలేదు. దాన్ని ఎత్తుకొని పోయి ఫోన్ చేశాడు - అలేఖ్య వాళ్ల అమ్మకి. వాళ్లమ్మ పాపకోసం వెతుక్కుంటున్నది కదా, అది ఇక్కడుందని చెబితే తనూ ఏడ్చింది సంతోషం కొద్దీ.

వెంటనే బయల్దేరి వొచ్చేశారు అందరున్నూ. అమ్మా, నాన్న అందరూ వచ్చారు, తెల్లారేసరికల్లా. "ఉగాది పండక్కి ఊరుకి రండమ్మా, అని ఎన్నిసార్లు చెప్పినా మీరెవరూ రాలేదు. చిన్ని పాప చూడు ఎంత మంచిదో! చక్కగా తనే వొచ్చింది. తన నవ్వులతోటీ, ఏడుపుతోటీ మిమ్మల్నందర్నీ కూడాపిలుచుకొచ్చింది చూడండి!" అని సుబ్బయ్య తాత మురిసిపోయాడు.

చిన్నితో పాటు అందరూ నవ్వుతుంటే తాత ఇంట్లో ఉగాది పండుగ వేడుకగా జరిగింది. వేప పూతా, కొత్తబెల్లమూ, కొత్త చింతపండూ, చిట్టి చిట్టి మామిడి పిందెలూ- అన్నీ వచ్చినై, పరుగు పరుగున. అటు తర్వాత ప్రతిసారీ అలేఖ్య వాళ్ల ఉగాది సుబ్బయ్యతాత ఇంట్లోనే! 

ఆకులతో బొమ్మలు!





# సమీక్ష

*కొత్తపల్లి పత్రిక ఫిబ్రవరి 2012 సంచికపై ఒక సమీక్ష...*
*నిర్వహణ: శ్రీమతి మాలతీకృష్ణ, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.*



చిన్నారి ప్రకాశ్ బొమ్మకు కథ చూసి చాలా సంతోషం వేసింది. వాడి చిన్న బుర్రకు తగ్గట్టే ఆట్టే గొడవలేమీ లేకుండా హాయిగా ఉంది కథ. ఇది ఒక 'ట్రెండు'గా మారాలని ఆశిద్దాం.

పిల్లల కథలు వైవిధ్యంగా ఉన్నాయి ఈసారి.

రాజు వ్రాసిన 'పట్టుబడిన దొంగ' చదివితే వాడి బుర్రలో ఓ మంచి చమక్కు వుందనిపించింది. సింపుల్ ట్విస్టుతో అలవోకగా కథనల్లేశాడు.

మైత్రేష్ పందికి పెట్టిన పేరు బావుంది- వెరైటీగా! తమాషాగా అల్లే ఇలాంటి కథలు పిల్లలను ఏదైనా విషయం పట్ల సృజనాత్మకంగా ఆలోచించేలా చేస్తాయి. సైన్సుకు, కల్పనకు పోటీ పెడితే చిన్నారులని రెండోదే ఆకట్టుకుంటుంది. నక్షత్రాలు గుండ్రంగా ఉంటాయని చెబితే ఆరేళ్ళ మా అమ్మాయి ఎంత దిగులు పడ్డదో చెప్పలేను! తనకు అస్సలు నచ్చలేదు ఆ విషయం.

'మారిన మనిషి' చాలా పరిణతి చెందిన వాళ్ళు వ్రాసిన కథలా ఉంది. 'మాస్టారి బ్రతుకులో నిండా వెలుగు ఉంది- నాది మాత్రం చీకటి బ్రతుకు' అన్న భావన ఐదో తరగతి పిల్లాడికి రావటం సాధ్యమేనా అనిపించింది. చాలా సున్నితంగా ఉంది కథని డీల్ చేసిన తీరు.

'బాతు కథ' లాంటివే- పందో, కోడిపిల్లో ఎగరాలనుకోవటం, అమ్మ మాట వినక చిక్కుల్లో పడటం గతంలో చదివాం. అలేఖ్య క్లుప్తంగా చక్కగా రాసింది.

రాజమకుటం లాంటి పెద్ద జానపద సినిమా కథని పకడ్బందీగా రెండు పేజీల్లో చెప్పేశాడు నాగుల్ షరీఫ్. ఈ కథని చదివితే ఎక్కడో చదివామే, అని అనిపించక మానదు.

చెడు ఎంత బలమైనదైనా, మంచి చేతిలో ఓడిపోతుందనే మన పిల్లలూ నమ్ముతారన్నమాట 'సూపర్‌డాల్' కథ

ద్వారా వంశీకృష్ణ చెప్పాడు. కథలోని మెలికలు ఒక ఎత్తైతే, భూమ్యాకర్షణ, పరీక్షా కేంద్రం లాంటివి అంత స్పష్టంగాతెలీడం, ఎక్కడా లొసుగులు లేకుండా కథని బిగించటం పదేళ్ళ పిల్లాడు ఎలా చేశాడన్నది పజిల్!

'రాజుగారి కుక్క'ని సుధ ప్రేమతోరాసింది. జంతువులని ప్రేమించాలని చెప్పింది. కాకపోతే ఆ ఆలోచనని కథగా మలచటంలోమరికొంచెం ఆలోచన అవసరమనిపించింది.

ఇక లక్ష్మీప్రసన్న చాలా మంచి అంశాన్ని ఎన్నుకొని కథని వ్రాసింది. ఇతర ప్రాణులని అంతమొందించే స్థాయికి తీసుకు పోయే మన జీవన శైలి ఎంత అన్యాయమైనదో! 'మన ఇళ్ళు పిచుకలకు కూడా అనువుగా వుంటే ఎంత బాగుంటుందో' అన్న ఆలోచన ఎంత స్వచ్ఛమైనదీ, ఎంత లోతైనదీ!

పిల్లల కథల ముందు పెద్దలవి చిన్నబోయాయనే చెప్పాలి. సిరిల్ డిసౌజా వ్రాసిన 'అద్భుతం'లో ఎంత త్రవ్వినా రంధ్రం రంధ్రంగానే ఉండటం, మొదట్లోనే దొరకాల్సిన బంతి చివరాఖర్లో కూరుకుపోయి ఉండటం అసహజంగా ఉంది. గాలి-నీరు మధ్య వివాదాన్ని గంగిపుల్లయ్యగారు తార్కికంగానే నిర్మించేందుకు ప్రయత్నించారుగానీ, చెట్లు లేకపోతే గాలి వీయదనటం తప్పుదోవ పట్టించేదిగా ఉంది. నీరు కొన్ని చోట్ల బహువచనమైంది.

ఇక 'కడుపునొప్పికి వాము' ప్రభుత్వంవారి ఆరోగ్య ప్రకటనని తలపింపజేసింది. బొమ్మలు, భాష కూడా పిల్లల్ని ఆకట్టుకునేలా లేవు. ఉద్దేశం మంచిదేనని గ్రహించగలం గానీ, ఈ పత్రికలో ఇటువంటివి అవసరమా అని సందేహం. ఇక పద్యాలని యథాతథంగా ప్రచురించటం కంటే, ఓ సందర్భం సృష్టించి వాడితే పిల్లలకు ఆసక్తికరంగానూ, ఉపయోగకరంగానూ ఉంటుందేమో!

యువకెరటాలు- ఇక్బాల్ మసీహ్ కథ కదిలించింది. పన్నెండేళ్ళ చిన్నారి సాధించినది అద్భుతమా, బాల్యాన్ని అంత అన్యాయంగా కోల్పోవడం విషాదమా? దీన్ని అందించిన కిషోర్ గారు అభినందనీయులు.

మనీష అందించిన 'మొక్కను బాబూ' పాటని లెక్కలేనన్నిసార్లు పాడుకున్నా, పాడిన ప్రతిసారీ ఒళ్ళు జలదరించక మానదు. చివరిలైన్లో 'రేపు చెట్టౌతాను-నన్ను కొట్టకు బాబూ' అని ఉండాలి.

ఇక చివరగా 'బాబోయ్ టివి' గురించి- టివి బారినుంచి పిల్లల్ని, (వాళ్ళకంటే ఎక్కువగా పెద్దల్ని-) రక్షించే శక్తి భగవంతుడికైనా వుందేమో తెలీదు. 'ఏదైనా అద్భుతం జరిగి మళ్ళీ ఒక్కసారి టివి లేని రోజులు తిరిగివస్తే ఎంత బాగుణ్ను' అనిపిస్తుంది. యోగి వ్రాసిన కథ సంపాదకీయానికి ప్రేరణనివ్వటం బాగుంది. టివి లేని ఇళ్ళకూ, దాని బారినుంచి తప్పించుకునే నేర్పు కలిగిన వాళ్ళకూ అభినందనలు! వేల వేల వందనాలు!

# విలియం యువాన్

యువకెరటాలు

*ఒక బాల మేధావి గురించి. ..* *నిర్వహణ: శ్రీమతి సౌమ్య, పుస్తకం.నెట్*



ఈసారి నేను పరిచయం చేయబోతున్నది విలియం యువాన్ అనే పదిహేనేళ్ళ అబ్బాయిని. అతను అమెరికాలోని ఆరెగన్ రాష్ట్రంలో స్కూల్లో చదువుకుంటున్నాడు. చిన్నవాడే అయినా, ఇప్పటికే ఈ అబ్బాయి చేసిన పనులను చూస్తే ముచ్చటేస్తుంది.

అమెరికా దేశంలో "డేవిడ్సన్స్ ఆర్గనైజేషన్" అని ఒక సంస్థ ఉంది. ఈ సంస్థ ఏటా పద్దెనిమిదేళ్ళ లోపు వయసున్న పిల్లల్లో అసాధారణ తెలివితేటలు ప్రదర్శించిన వారికి, వాళ్ళు చేయాలనుకుంటున్న పరిశోధనలను ప్రోత్సహిస్తూ, ఉపకార వేతనం ఇస్తుంది. అలా 2005 వ సంవత్సరంలో మన యువాన్‌కి కూడా ఈ అవార్డు దక్కింది.

ఇంతకీ, ఈ అబ్బాయి ఏం చేశాడూ అంటే : ఒక కొత్తతరం 3D Solar cell తయారు చేసాడు. మీరు ఎప్పుడైనా సోలార్‌సెల్‌ని చూశారా? మెరిసే బిళ్ళల్లాంటివి, ఒక గాజు పలకలో పెట్టి ఉంటాయి. దాన్ని సూర్యుడి వెలుతురులో పెడితే వాటినుండి కరెంటు బయటికి వస్తుంది!

అయితే యువాన్ రూపొందించిన నమూనాలో బిళ్లలు పలచగా, నేలబారుకి ఉండవు. చిన్న చిన్న డబ్బాలలాగా ఉంటాయి. మామూలు సోలార్ పలకల్లో సిలికాన్ వగైరా మూలకాలను వాడితే, వీటిలో అతి సూక్ష్మమైన కర్బన పైపులు ఉంటాయట! వీటి వల్ల అవి మామూలు వెలుగునే కాదు; సూర్యరశ్మిలో కంటికి కనబడని అతి నీలలోహిత కిరణాలను సైతం సేకరించేస్తాయి. అలా అతను తయారు చేసిన సోలార్ సెల్ సౌరశక్తి ఉత్పత్తి మామూలు సోలార్ సెల్ తో పోలిస్తే ఐదు వందల రెట్లు పెరిగిందట! ఇంకా పూర్తిగా మార్కెట్లోకి రాని అత్యాధునిక త్రీడీ సోలార్ సెల్‌లతో పోలిస్తే ఇది

తొమ్మిది రెట్లు నయమట!

అలాగే, సౌర ఇంధన సాధనకు ఉపయోగపడే "సోలార్ టవర్" కి ఒక కొత్త డిజైన్ ప్రతిపాదించాడు యువాన్. ఆ టవర్‌లోపల కూడా అతి సూక్ష్మంగా ఉండే పైపుల సాంకేతికత ఉన్నది. అతను రాసిన కంప్యూటర్ ప్రోగ్రాం ద్వారా ఆ టవర్ పని తీరును అధ్యయనం చేయవచ్చుట కూడాను. మరి, ఇదంతా చేస్తున్నప్పుడు అతని వయసు ఎంత అనుకుంటున్నారు? పన్నెండేళ్ళు మాత్రమే!!

అతనికి పదేళ్ళ వయసు ఉన్నప్పుడు అతను అమెరికాలో పిల్లలకు సైన్సుపైన ఆసక్తి కలిగించేందుకు రూపొందించిన "ఫస్ట్ లెగో లీగ్" అన్న కార్యక్రమంలో చేరాడు. అక్కడే అతనికి పర్యావరణానికి హాని కలిగించని ఇంధన వనరుల గురించి, సూక్ష్మంగా ఉండే పైపులకు సంబంధించిన 'నానో టెక్నాలజీ' గురించి అవగాహన కలిగిందట. భావితరాలకి సౌరశక్తి వల్ల గల ఉపయోగాలు అర్థమై, ఈ దిశలో పరిశోధన మొదలుపెట్టాడట. స్కూలు పాఠాలు కాకుండా, ఈ పరిశోధనల కోసం విడిగా కూడా కొన్ని కోర్సులలోకూడా చదివాడట. వాళ్ళ నాన్న యూనివర్శిటీలో పనిచేయటం అతనికి కలిసి వచ్చింది కూడా.

ఇవన్నీ చేశాడంటే 'వాడు ఒట్టి పుస్తకాల పురుగు' అనుకోకండి. యువాన్‌కి తాయిక్వాందో అనే యుద్ధక్రీడలో బ్లాక్ బెల్ట్ కూడా ఉందట. పియానో వాయించడం, చెస్ ఆడడం కూడా తెలుసట. వీటిల్లో ఎన్నో బహుమతులు కూడా వచ్చాయి. ఇవన్నీ కాక, దగ్గరలో ఉన్న ఎలిమెంటరీ స్కూలులో అప్పుడప్పుడు పాఠాలు కూడా చెబుతాడట!

ఇంత చిన్న వయసులోనే ఇవన్నీ చేసాడంటే ఆశ్చర్యంగా లేదూ! 'అందరం విలియంలా అయిపోవాలి' అని లేదు కానీ, మన పాఠ్య పుస్తకాలకి అవతల కూడా మన తడాఖా చూపించుకోవాలి. ఇలాంటి ప్రోగ్రాములు, అవార్డులు మనదేశంలో ఉండొచ్చు; ఉండకపోవచ్చు. అయినా కూడా, మనకున్న పరిమితుల్లో స్కూలు హద్దులు దాటి ఎదగాలి. ఏమంటారు?

# చిలిపి ప్రశ్నలు-తిక్క జవాబులు

నిర్వహణ: వి.వి.యస్.మూర్తి, చొదిమెళ్ళ.

1. టి.వి. యాంకర్‌కు పెళ్ళిచూపుల్లో 'నీ పేరేంటమ్మా' అని కాబోయే అత్తగారు అడిగితే......!?

జవాబు: "ఈ ప్రశ్నకి జవాబు- బ్రేక్ తర్వాత!" అంటుంది యాంకరమ్మ!

2. ప్రభుత్వం ఉలిక్కిపడేదెప్పుడు!?

జవాబు: "రిటైరయ్యాక లంచాలు రావు; కాబట్టి పెన్షన్ పెంచాలి" అని ఉద్యోగులు నిరాహారదీక్ష చేసినప్పుడు.

4. ఆర్‌టిసి డ్రయివరు పైలట్ అయితే ఏమంటాడు!?

జవాబు: 'సీట్లులేవు స్టాండింగ్ అయితే ఎక్కండి' అంటాడు.

5. విద్యారంగం గురించి తెలిసిన విలేఖరి విస్తుపోయేదెప్పుడు!?

జవాబు: "విద్యార్థుల వద్దకే ఉపాధ్యాయులు" పథకం గురించి ఆలోచిస్తున్నా అని ముఖ్యమంత్రి అన్నప్పుడు.

6.జడ్జిగారు అవాక్కయ్యేదెప్పుడు?

జవాబు: "గిన్నీస్ బుక్‌లో స్థానం కోసం విడాకులు తీసుకుంటున్నాం" అని వృద్ధ దంపతులు వివరించినప్పుడు.

8.'విదేశీ వ్యామోహం' అంటే..!?

జవాబు: ఇండియాలో వున్నప్పుడు చైనీస్ రెస్టారెంట్‌కు వెళ్ళటం , చైనా వెళ్ళినప్పుడు ఇండియన్ రెస్టారెంట్‌కు వెళ్ళటం.

# పదరంగం-13

*ఈ పదరంగం చాలా సులభం! దీన్ని ఓ పోస్టుకార్డులో పూరించి పంపండి. మీ పేరుతో బాటు మీ బడి పేరు, తరగతి తప్పక రాయండి. సరైన సమాధానాలు పంపిన పిల్లల పేర్లను పదరంగం-14 తోపాటు ప్రచురించగలం. నిర్వహణ: దేవి, బెంగుళూరు.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | ■ | 4 |
| | ■ | 5 | | 6 | |
| 7 | | | ■ | 8 | |
| | ■ | | ■ | | ■ |
| 9 | | | 10 | ■ | 11 |
| | ■ | ■ | 12 | | |

ఆధారాలు- **నిలువు:**

1. సంవత్సరాదికి తినే ఆరు రుచుల పచ్చడి (6)
2. చక్కలిగింతల్ని ఇలా కూడా అంటారు (5)
3. 'గోడ మీద బొమ్మ గొలుసుల బొమ్మ.. '(2)
4. విజయం(3)
6. కారు కాని కారు(3)
10. 'రామ రామ' - ఒక్కసారనండి చాలు (2)
11. రంగులు చల్లుకునే పండుగ (2)

ఆధారాలు- **అడ్డం:**

1. బియ్యం అన్నమెలా అవుతుంది?(4)
5. ఇవి తీసి ఉంటేనే ఇంట్లోకి రాగలరు (4)
7. 'దీనికి' దీర్ఘం లేదు (3)
8. కారం, పులుపు-వీటి మొదటక్షరాలు(2)
9. తడబడిన 'అచ్చురాలు' (4)
12. ప్రయాణాల్లో మధ్యలో ఆగే చోటు (3)

పదరంగం 12 కు సమాధానం



| | | | | | |
|---|---|---|---|---|---|
| రే | పు | ■ | ఉ | యుక్త | [illegible] |
| ■ | నా | ■ | త్త | ■ | ■ |
| ఆ | డి | వా | రం | ■ | గ |
| స | ■ | డి | ■ | బ | డి |
| క | త | కో | తో | ■ | యా |
| ట్ల | ■ | సం | వ | త్స | రం |

పదరంగం-11కి సరైన సమాధానం రాసి పంపిన పిల్లలు:

1. కె.భార్గవ్, అరవిందహైస్కూల్, కుంచనపల్లి.
2. వి.వినయ్ కుమార్, అరవింద హైస్కూల్, కుంచనపల్లి.
3. యం.నిహారిక. అరవిందహైస్కూల్, కుంచనపల్లి.
4. తరుణిస్ఫూర్తి, 4వతరగతి, గడ్డంనాగేపల్లి, నార్పల.
5. జి.సత్యలక్ష్మి, రెండోతరగతి, ఇంటిబడి, చెన్నేకొత్తపల్లి.
6. ఏ.యస్. నందన, 4వ తరగతి, ప్రకృతి బడి, చెన్నేకొత్తపల్లి.

# చిట్టి పాటలు

*గానం: వర్షిణి, నాలుగేళ్ళు, చెన్నేకొత్తపల్లి.*

### 1. చిట్టి చిలకమ్మ

చిట్టిచిలకమ్మ

అమ్మకొట్టిందా

తోటకెళ్ళావా?

పండు తెచ్చావా?

గూట్లో పెట్టావా?

గుటుక్కు మింగావా!






### 2. చుక్ చుక్ రైలు

చుక్చుక్రైలు వస్తోంది

దూరం దూరం జరగండి

ఆగినంక ఎక్కండి

జోజో పాపా ఏడవకు

లడ్డు మిఠాయి తినిపిస్తా

చల్లని పాలు తాపిస్తా

చక్కని సినిమా చూపిస్తా.

**3.ఊష్ కాకి**

ఊష్కాకి!

మా చేనులో వాలద్దు

మా కంకి కొరకద్దు.

మా చేనులో వాలద్దు

మా నాన్న పేదోడు

మా అమ్మ రాకాసి

నేనేమో గ్లాకోసు!





**4. దుబ్బోడి పాట**

దుబ్బోడమ్మా దుబ్బోడు

దుబ్బ బిస్కెటు తిన్నాడు

ఇంకా కావాలన్నాడు

అమ్మకు కోపం వచ్చింది

మూడు గుద్దులు గుద్దింది

## 5. శాంతక్క పాట

శాంతక్కా

బావేడి?

బజారుకు వెళ్ళాడు

ఏమి తెచ్చాడు?

పప్పులు తెచ్చాడు

పొప్పులు ఏవీ?

గుడ్డోడు తిన్నాడు

ఎట్లా తిన్నాడు?

కాల్చుకొని తిన్నాడు

ఏమి కాలింది?

మీసం కాలింది.



కొత్తపల్లి పత్రికలోని ఈ పాటల్ని మీరు ఇంటర్నెట్లో వినచ్చు. సందర్శించండి http://kottapalli.in

**ముద్రిత ప్రతుల వెల:**

ప్రతి ఒక్కింటికి: 20 రూ.

12 పుస్తకాలకై చందా: 240 రూ.

“కొత్తపల్లి ట్రస్టు” పేరిట యంవో/డిడిని ఈ చిరునామాకు పంపండి: కొత్తపల్లి ట్రస్టు, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101, ఆంధ్రప్రదేశ్.

బ్యాంకు అక్కౌంటు వివరాలు:

“Kottapalli Trust”,
A/c No. 0138101018809 (savings), Canara Bank, Chennekothapalli. IFSC: CNRB0000138

ఫోన్లు: 08559 240222, 7702877670

ఇ-మెయిలు: team@kottapalli.in

**ఈ నెలలో ఏపని-ఎవరిది?**

ఆర్థిక వ్యవహారాలు, నిర్వహణ: సుబ్బరాజు

సంపాదకత్వం: నారాయణ

వెబ్సైటు, సాంకేతికత: ఆనంద్, లక్ష్మి

అక్షరకూర్పు: శ్రీలక్ష్మి

ముద్రణ: 'ముద్రిక' కృపాకరరావు

ముఖచిత్రం 'వసంతం వచ్చింది': అడవి

చిత్రాలు: రామ్, వినయ్, గౌరి, వాసు, ప్రసాద్, రాజశేఖర్, వెంకట్,సురేష్, జాహ్నవి.

బొమ్మకు కథ: జి.లలిత, telugu4kids

కథలు, పాటలు: చాలామంది పిల్లలు

**ప్రత్యేక కృతజ్ఞతలు:**

ప్రకృతి బడికి, అరవింద స్కూలు వారికి, రిషివ్యాలీ స్కూలు వారికి, మన లైబ్రరీ వారికి, telugu4kidsవారికి, చిలిపి ప్రశ్నల మూర్తిగారికి, 'విద్యార్థి' మాలతీకృష్ణగార్లకి, రాధా రాజశేఖర్ గార్లకి, కంప్యూటర్లలో లైనక్సు వ్యవస్థను చక్కగా అందిస్తున్న ఉబుంటు వారికి, జింప్, అడాసిటీ తదితర ఓపెన్ సోర్సు సాఫ్టువేరు నిర్మాతలకు, ఇంకా పేర్లు రాయని అనేకమందికి.

పిల్లల్లో సృజనాత్మకత సహజం. కథలు, ఆటలు, పాటలు, బొమ్మలు దానికి ఊతాన్నిస్తాయి. మాతృభాషలో ఇష్టంగా చదవటం, తేలికగా రాయటం వస్తే అటుపైన అన్ని శాస్త్రాలూ సులభంగా వంటపట్టుతాయి-నిజం! అందుకని మీ పిల్లల్లో ఉన్న కాల్పనిక శక్తికి పదును పెట్టండి. వాళ్లను కథలు రాసేందుకు, పాటలు పాడేందుకు, బొమ్మలు వేసేందుకు ప్రోత్సహించండి. వాళ్ళ రచనల్ని మాకు పంపండి. కావాలనిపిస్తే మీరే ఇలాంటి పత్రికనొకదాన్ని మొదలు పెట్టండి- ఎలాగైనా సరే- పిల్లలు పెద్దవాళ్లయ్యేలోగా వాళ్ళు చాలా చాలా తెలుగు కథల్ని చదివేలా, రాసేలా చేయండి. మీ పిల్లలకు ఈ పత్రికలోని కథలు నచ్చుతాయనే మా నమ్మకం- వీటిని వీలైనంత మందితో పంచుకోండి. మీరు రాసిన పిల్లల కథలు ఏమైనా ఉంటే పనిగట్టుకునైనా సరే, మాకు పంపండి. వీలు చేసుకొని ప్రచురిస్తాం.

మంచి పుస్తకం:

## తయారు చేద్దాం

చేతులతో పని చేయటం అంటే చాలా ఇష్టం పిల్లలకి. కాయితాలు, రంగు పెన్సిళ్ళూ ఇస్తే ఎన్నెన్ని దృశ్యకావ్యాలు రచిస్తారో చెప్పలేం. పిల్లల సృజనను పోషించటంలో కాగితాల పాత్ర ఎంత గొప్పదో చెప్ప తరం కాదు.

రంగు కాగితాలు రకరకాలు దొరుకుతుంటాయి మార్కెట్లో- వాటిని ఉపయోగించుకొని బడులలో ఉత్సవాలకు, ప్రదర్శనలకు అందాన్ని చేకూర్చే వస్తువులు అనేకం బళ్ళోనే తయారు చేసుకోవచ్చు. కాగితంతో మాస్కులు, పువ్వులు, పక్షులు, విసనకర్రలు- మరెన్నో తయారు చేయచ్చు. ముందుగానే రకరకాల వస్తువులు ఇలాంటివి చేసిపెట్టుకుంటే పిల్లలు నాటకాలు వేసినప్పుడు, ప్రదర్శనలు పెట్టినప్పుడు వాటిని వాడుకోవచ్చు కూడా!

తాతా రమేష్‌బాబు గారు రాసిన "తయారు చేద్దాం" పుస్తకం ఇలాంటి ఓ ఐదారు రకాల వస్తువుల్ని చేసి చూపుతున్నది. ఇది పరిచయం చేస్తున్నది చాలా ప్రాథమిక అంశాలనే అయినా, ఇందులో బొమ్మలు, వాటిని ఎలా తయారు చేయాలో చెప్పిన తీరు పిల్లల్ని ఆకట్టుకుంటాయని అనిపిస్తుంది. "ఏడెనిమిదేళ్ళ పిల్లలు ఈ పుస్తకాన్ని చూశారంటే తటాలున కూర్చొని ఒకటో రెండో బొమ్మలు తప్పకుండా చేసుకుంటారు" అనిపిస్తుంది- ఒకసారి ఇలా పని మొదలు పెట్టిన పిల్లలు ఎలాగూ ఇవి చేసి ఊరుకోలేరు కదా, మరిన్ని బొమ్మలు చేస్తారు! మీరూ చెయ్యండి:

**తయారు చేద్దాం**

తాతా రమేష్‌బాబు,

అభినందన పబ్లిషర్స్, విజయవాడ.

60 పేజీలు, 40 రూ.



# అయ్యో! తెలుగు రాదే, ఎలాగ?!

"కథలమ్మో కథలు! కథలమ్మో కథలు! రకరకాల కథలు! తెలుగు పిల్లల కథలు!"

"ఏం కథలు బాబూ? మా పిల్లలకు తెలుగు చదవటం రాదు. ఇంగ్లీషు కథలు ఏమన్నా ఉన్నాయా, నీ దగ్గర?"

"ఇంగ్లీషువైతే వేరేవాళ్ళ దగ్గర దొరుకుతాయండి. నా దగ్గర ఉన్న సరుకంతా తెలుగువాళ్ల కోసమే. ఏం, మీ పిల్లలు తెలుగువాళ్ళు కారాండీ? పాపం, వాళ్ళకి కొంచెం తెలుగు నేర్పించకపోయారూ?"

"ఏమో నాయనా! మా వాళ్లకైతే ఇంగ్లీషు అంటేనే ఇష్టం. ఆ ఇంగ్లీషు నేర్చుకునేసరికే వాళ్ల తల ప్రాణం తోకకొచ్చింది. ఇంక తెలుగు ఎక్కడ నేర్చుకుంటారు?"

"అవున్లెండి, పాపం. కానీ నా దగ్గర ఉన్నవి తెలుగు కథలేనండి. మీకు పనికిరావు."

"ఏదీ, ఓసారి చూడనియ్యి- పుస్తకం బానే ఉన్నట్టుందయ్యా, కాయితం, రంగులు అదీనీ- దీన్ని పాపం ఇంగ్లీషులో అచ్చెయ్యకపోయారూ? మీకూ కొంచెం అమ్మకాలుండేవి గద! ఇప్పుడు పిల్లలంతా ఇంగ్లీషు బళ్లలో చదివీ చదివీ, తెలుగుని పూర్తిగా మరచే పోతున్నారుగా?"

"అవునండీ, అందుకనే వీటిని తెలుగులో మాత్రమే అచ్చేస్తున్నాం. మీ పిల్లలకి ఈ కథలు కావాలంటే వాళ్ళు తెలుగు నేర్చుకోవాల్సిందే, తప్పదు. లేకపోతే ఇంకో మార్గం ఉంది- మీరు వాళ్లకి చదివి పెట్టచ్చు-"

"అవున్లే, అట్లాగైనా వాళ్లకి మెల్లగా తెలుగు చదవటం వస్తుందేమో, చూస్తాను. కథలు చదవటం కోసమన్నా వాళ్ళు తెలుగు నేర్చుకుంటారేమో"

"తప్పకుండా నేర్చుకుంటారు చూడండి. అదేమంత బ్రహ్మవిద్య? తలచుకుంటే వాళ్ళు ఒక్కరోజులో నేర్చుకోగలరు. కథల్లో మాయ మీకు తెలీనిదా? మీరు చిన్నప్పుడు ఎన్ని కథల పుస్తకాలు చదవలేదు?"

"అవును నాయనా! ఇప్పుడు తెలుగు పుస్తకాలే కరువైపోతున్నాయి"

"ఏమీ లేదండీ! ఆదరించేవాళ్లు ఉంటే భాష చటుక్కున పుంజుకుంటుంది. ఏం చేసినా తెలుగులో అర్థమైనంత బాగా పరాయి భాషలో ఎంతమందికి అర్థమౌతుంది, చెప్పండి? ఏదో ఒక మాయ చెయ్యాల్సిందేనండీ. మీ పిల్లలకి 'తెలుగు రాదు' అని ఊరుకోకండి. ఏదో ఒకటి చేసి వాళ్ళ భాషని వాళ్ళకి ఇవ్వాలి- లేకపోతే కుదరదు."

"అంతేనంటావా?"

"అంతేనండీ- వేరే మార్గం లేదు. మాతృభాష తర్వాతే, వేరే ఏదైనా."

Edited, typeset and Published by Narayana for Kottapalli Trust, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP. Ph:08559 240222 E-mail: team@kottapalli.in